


# MYSORE TIGER : TEEPU SULTHAN

Telugu title of this book is  MYSORE PULI : TEEPU SULTHAN.

In this book titled  Mysore Tiger : Teepu sultan,  life Sketches of Teepu  is given with good number of rare photos, highlighting the very special nature of Teepu. And refuting  the criticism and malicious propaganda or tirade against Teepu fabricated by some communal forces and anti Muslims elements against the Teepu, with historical evidence. For the preparation of this book Writer went to Sreerangapatnam, Mysore twice to get information and Photos of Teepu.

This Book contains total 78 pages of 1/8$^{th}$ Demmy Size with Multi color title published in 2006.

Actually this book is published in 2002 with 32 Pages only. Later on it was rewised published second time.

# మైసూరు పులి

# టిపూ సుల్తాన్



## సయ్యద్ నశీర్ అహమ్మద్




## సయ్యద్ నశీర్ అహమ్మద్

| | |
|---|---|
| తల్లిదండ్రులు | : సయ్యద్ బీబీజాన్, సయ్యద్ మీరా మొహిద్దీన్ |
| జననం | : 22 డిసెంబరు 1955 |
| పుట్టిన ఊరు | : నెల్లూరు జిల్లా పురిణి గ్రామం |
| వృత్తి | : న్యాయవాది |
| ప్రవృత్తి | : జర్నలిజం (రెండు దశాబ్దాలపాటు 'ఉదయం', 'వార్త' దినపత్రికలలో, 'సిటీ కేబుల్ నెట్‌వర్క్ ప్రైవేట్ లిమిటెడ్'లో పలు బాధ్యతల నిర్వహణ.) |
| జీవిత భాగస్వామి | : షేక్ రమిజాబాను |
| సంతానం | : సయ్యద్ జాస్మిన్ అహమ్మద్<br>అల్లుడు : డా॥ ఎస్.ఎం. తల్మీజుద్దీన్ |
| సాహితీ కృషి | : ప్రముఖ తెలుగు పత్రికల్లో పలు కవితలు, కథానికలు, వ్యాసాలు |
| రచనలు | : 1. భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లిం మహిళలు<br>2. భారత స్వాతంత్ర్యోద్యమం: ఆంధ్రప్రదేశ్ ముస్లింలు<br>3. భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లిం ప్రజాపోరాటాలు<br>4. భారత స్వాతంత్ర్య సంగ్రామం : ముస్లిం యోధులు-1<br>5. షహీద్-ఎ-ఆజమ్ అష్ఫాఖుల్లా ఖాన్<br>6. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లింలు |
| ఆశయం | : లౌకిక ప్రజాస్వామ్య వ్యవస్థ |
| వ్యాపకం | : అధ్యయనం, రచన, ప్రచురణ, ప్రసంగాలు |
| నివాసం | : శివప్రసాద్‌స్ట్రీట్, కొత్తపేట, వినుకొండ-522 647, గుంటూరు జిల్లా.<br>✆ : 08646-272411, Cell : 9440241727 |



**TELUGU ISLAMIC PUBLICATIONS**

Sandesha Bhavanam, Chatta Bazar

Hyderabad - 500 002. India.

ISBN 81-88241-36-9

# మైసూరు పులి
# టిపూ సుల్తాన్


**సయ్యద్ నశీర్ అహమ్మద్**

M.Com;LLB; D.P.M; D.L.L.
Sahitya Ratna (Hindi)



HYDERABAD

**తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్**
సందేశభవనం, లక్కడ్‌కోట్,
హైదరాబాద్-500 002.





**MYSORE PULI TIPU SULTAN**

| | | |
|---|---|---|
| **TIP Series No.** | **:** | **141** |
| Written by | : | **Syed Naseer Ahamed** |





| | | |
|---|---|---|
| First Edition | : | May 2006 |
| Copies | : | 2000 |
| ISBN | : | 81-88241-36-9 |
| Published by | : | Telugu Islamic Publications<br>Sandesha Bhavanam,<br>Lakkadkot, Chatta Bazar,<br>Hyderabad-500 002. India.<br>Phone: 24564583<br>Fax : +91 +40 + 24576237<br>e-mail: tiphyderabad@rediffmail.com<br>website: www.teluguislamiclit.org |
| Typeset by | : | Geeturai Graphics<br>Lakkadkot, Hyderabad-2. |
| Printed at : | : | Cosmic Printers<br>Lakkadkot, Hyderabad-2. |
| **Price** | **:** | **Rs. 25** |

## ఇందులో...








**అబ్బాదుల్లా**
డైరెక్టర్
తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
సందేశభవనం, లక్కడ్‌కోట్
ఛత్తాబజార్, హైదరాబాద్-2


## ప్రచురణకర్త మాట

ప్రముఖ రచయిత **సయ్యద్ నశీర్ అహమ్మద్** రాసిన ఈ చిరు పుస్తకం వలన మైసూరు పులి టిపూ సుల్తాన్ జీవిత అధ్యయనం సాధ్యపడుతుంది. చక్కని పరిపాలన దక్షతతో, ఆర్థిక, సామాజిక రంగాలలో జాతీయ, అంతర్జాతీయ, రాజకీయాలలో తనదైన ప్రజ్ఞాపాటవం చూపిన టిపూ జీవితం ఈనాటి పాలకులకు ఆదర్శం.

ఈ పుస్తకం తొలుత 2002 మే నెలలో **ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్** ద్వారా ప్రచురితమైంది. ఆ సందర్భంగా లభించిన పాఠకాదరణ వలన 2004 మే మాసంలో పునర్ముద్రణ అయ్యింది.

ఈమధ్య **తెలుగు జీవిత గాథల్లో గొప్పగా వచ్చిన పుస్తకం** అంటూ పండితుల ప్రశంలందుకున్న ఈ పుస్తకానికి మరింతగా లభించిన ఆదరణ మూలంగా మరిన్ని మార్పులు చేర్పులతో, అరుదైన నూతన ఫొటోలు, చిత్రాలతో మూడవసారి ముచ్చటగా ముద్రితమై ప్రస్తుతం మీ ముందుకు వచ్చింది.

మన చరిత్రను మరుస్తున్న నవయువకులు భారత దేశ మహనీయుల జీవితాలను మధురమైన తెలుగు భాషలో అవగాహన చేసుకునేందుకు ఈ పుస్తకం ఎంతగానో దోహదపడుతుందని ఆశిస్తున్నాం.

**- అబ్బాదుల్లా**



**యం.డి. సౌజన్య**
ప్రముఖ రచయిత, కవి
తెనాలి.

# పరిచయ వాక్యం

విజేతలదే చరిత్ర. పరాజితుల చరిత్ర చాలావరకు ప్రాచుర్యానికి నోచుకోదు. విజయం సాధించిన వర్గాలు ఆనాటి అన్ని రంగాలను శాసిస్తాయి. అందువలన సహజంగా విజేతల చరిత్ర అక్షరబద్ధమవుతుంది. పరాజితుల ఆనవాళ్ళు కన్పించకుండా పోతాయి. ఈ పరిణామాలలో విజేతలు పరదేశీయులు, పరాజితులు స్వదేశీయులు అయినట్లయితే, తమ పాలనకు స్థానిక జనసముదాయాల అనుకూలతను సాధించేందుకు పరాజితుల చరిత్రలు ఘోరంగా వక్రీకరించబడతాయి. పాలకవర్గాల లక్ష్యాలకు అనుకూలంగా చిత్రించబడతాయి. చివరకు ఆ వక్రీకరించిన – చిత్రీకరించిన చరిత్రే భవిష్యత్తు తరాలకు చరిత్రగా మారుతుంది. ఆ చరిత్రను భావితరాలు నమ్మాల్సిన పరిస్థితులు ఎదురవుతాయి. ఈ అవకాశాలను రాజ్యకాంక్షాపరులైన వ్యక్తులు–శక్తులు ఆ తరువాత కాలంలో చాలా తెలివిగా ఉపయోగించుకుంటాయి.

మన దేశంలోని చరిత్ర పలు వక్రీకరణలకు–చిత్రీకరణలకు గురయ్యింది. బ్రిటీషర్లు మన గడ్డమీద అడుగుపెట్టి, స్వదేశీ పాలకులను పరాజితులనుచేసి, అధికారాన్ని చేజిక్కించుకుని, ఆరంభించిన పాలనకు స్వదేశీయుల ఆమోద ముద్ర పొందేందుకు పరాజితులైన స్వదేశీ పాలకుల గడచిన కాలంనాటి పాలన అత్యంత క్రూరమైనదిగా పేర్కొంటూ, ఆ పాలకులను నిరంకుశులుగానూ, కడు దుష్టులుగాను చిత్రిస్తూ గ్రంథాలు రచించారు. ఈ కార్యక్రమాన్ని అధికార స్థాయిలో భారీ ఎత్తున నిర్వహించారు. ఈ కార్యక్రమాన్ని సమర్థవంతంగా నిర్వహించేందుకు ప్రముఖ ఆంగ్ల రచయితలను, ఆంగ్లేయాధికారులను, మిషనరీలను ప్రత్యేకంగా నియమించారు, అవసరానికి మించిన ధనసంపదలను నిర్దేశిత లక్ష్యాల కోసం అందజేసి చరిత్రను తిరగరాయించారు. ప్రముఖ ఆంగ్ల రచయిత J S Grewal తన గ్రంథం Muslims Rule in India : The Assement of British Historians, (Oxford University Press, 1970) లో ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, '..British administrators, scholors, historians and missionaries all become seriously involved in making the people believe that British rule was better than medieval Muslim rule.' అన్నాడు.



ఈ మేరకు భారతదేశంలోగల అధిక సంఖ్యలోగల ముస్లిమేతరుల సమ్మతి సాధించేందుకు సాగిన చరిత్ర వక్రీకరణ – చిత్రీకరణలకు ముస్లిం పాలకులు ప్రధానంగా బలయ్యారు. ఆ విధంగా దుష్ప్రచారానికి గురైన స్వదేశీ పాలకులలో మైసూరు పాలకుడు టిపూ సుల్తాన్ ఒకరు. భరత గడ్డనుండి బ్రిటీషు పాలకులను తరిమివేయడం కోసం తన ప్రాణాలను ఫణంగా పెట్టి, ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులను ముప్పుతిప్పలు పెట్టిన టిపూను ప్రధాన శత్రువుగా భావించిన ఆంగ్లేయులు ఆయనను దుర్మార్గుడిగా చిత్రించారు. ఆయన చరిత్రను వక్రీకరించారు. ఆ మేరకు దుష్ట ప్రచారం చేశారు. ఆ ప్రచారాన్ని భుజాలమీద మోస్తూ, ఈనాటికి కొన్ని మతోన్మాద రాజకీయశక్తులు ప్రచారానికి పూనుకుని పనిచేస్తున్నాయి. 1999లో టిపూ సుల్తాన్ ద్విశతవార్షికోత్సవాలను కర్ణాటక రాష్ట్ర ప్రభుత్వం జరపదలపెట్టిన సందర్భంగా టిపూను మతోన్మాదిగా, హిందూ ద్వేషిగా చిత్రిస్తూ సంఘపరివారం ప్రచార కార్యక్రమాన్ని నిర్వహించింది.

అటువంటి కుట్రపూరిత ప్రచారాలను వమ్ముచేయాలంటే వాస్తవాలు బహిర్గతం కావాలి. పదిమందికి తెలియాలి. ఆ దిశగా చరిత్రకారులు కృషి సాగించాలి. మన దేశంలోని విభిన్న జన సముదాయాలు తమ పూర్వీకుల త్యాగాలను తెలుసుకోవాలి. ఆ విధంగా కలిగిన ఎరుకవల్ల ఆయా సామాజిక సముదాయాల మధ్య సదవగాహన ఏర్పడుతుంది. ఆ సదవగాహన నుండి సద్భావన అంకురిస్తుంది. ఆ సద్భావన ఫలితంగా సమాజంలో సామరస్యం పటిష్టమౌతుంది. ఆ వాతావరణంలో ప్రజాస్వామ్య–లౌకిక వ్యవస్థలు పరిఢవిల్లుతాయి. ఈ లక్ష్యంతో భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ముస్లింల భాగస్వామ్యాన్ని వివరిస్తూ తెలుగు పాఠకుల కోసం చరిత్ర రచన సాగిస్తున్న సయ్యద్ నశీర్ అహమ్మద్ మైసూరు పులి: టిపూ సుల్తాన్ అను మరో గ్రంథాన్ని రాశారు. ఈ పుస్తకం పేజీల లెక్కన చూస్తే చిన్నదే అయినా, పుస్తకంలోని అంశాన్ని బట్టి బేరీజు వేస్తే చాలా బరువైనది కనుక ఈ పుస్తకాన్ని పిట్ట కొంచెం కూత ఘనం అనక తప్పదు.

మాతృభూమి నుండి బ్రిటీషర్ల తరిమివేతకు పోరుబాటను ఎన్నుకున్న టిపూ సుల్తాన్, జాతీయ భావనలతో స్వదేశీ పాలకుల ఐక్య సంఘటన నిర్మించేందుకు ఏ విధంగా ప్రయత్నించాడో ఈ పుస్తకంలో రచయిత వివరించారు. ఓయుద్ధ తంత్ర నిపుణుడిగా, అసమాన పోరాట యోధుడిగా మాత్రమే కాకుండా జనరంజక పాలకుడిగా, సాహిత్య వేత్తగా, రచయితగా, పత్రికా సంపాదకుడిగా, పుస్తక ప్రేమికుడిగా, సంస్కర్తగా, లౌకిక ప్రభువుగా, అంతర్జాతీయ వ్యవహార దక్షుడిగా, రాజనీతి కోవిదుడిగా, మనసున్న మహారాజుగా, వర్తక– వాణిజ్యరంగాలలో నూతన దృక్పధాల ఆవిష్కర్తగా, స్వదేశీ –

విదేశీ పరిజ్ఞానాన్ని మేళవించి కొంగ్రొత్త విధానాల రూపశిల్పిగా, పరమత సహనంగల రాజుగా, పర్యావరణ పరిరక్షకుడిగా, న్యాయవ్యవస్థలో సరికొత్త శిక్షల విధానాన్ని ప్రవేశపెట్టిన సుల్తాన్‌గా, రైతాంగం మిత్రుడిగా, నావికాదళ వ్యవస్థకు వినూత్న హంగులు చేర్చిన దార్శనికుడిగా, యుద్ధ క్షిపణులు తయారి-వినియోగంలో ప్రథముడిగా, అన్నిటికి మించి మాతృభూమి రక్షణ కోసం వైరి వర్గాలను చెండాడుతూ యుద్ధరంగంలో కన్నుమూసిన ప్రపథమ స్వదేశీ యోధుడిగా టిపూ సుల్తాన్ వ్యక్తిత్వంలోని విభిన్న కోణాలను ఈ గ్రంథం ఆవిష్కరించింది.

ఈ ఉన్నత-ఉత్తమ లక్షణాలన్నీ టిపూ సుల్తాన్‌లో నిబిఢీకృతమైయున్నాయన్న విషయాన్ని ధృవీకరించేందుకు ప్రముఖ ఆంగ్లేయ రచయితలు స్వయంగా రాసిన పలు గ్రంథాల నుండి ఆధారాలను రచయిత సయ్యద్ నశీర్ అహమ్మద్ చూపారు. ఈ గ్రంథంలో పేర్కొన్న ప్రతి ప్రాధాన్యతగల అంశాన్ని నిరూపించేందుకు బ్రిటీషు అధికారులు, స్వయంగా టిపూతో యుద్ధరంగంలో తలపడిన అంగ్లేయ సైనికాధికారులు ఉటంకించిన వాక్యాలను రచయిత ఈ గ్రంథంలో పొందుపర్చుతూ, తాను రాసిన విషయాలకు బలం చేకూర్చారు. టిపూను పరాజితుడ్ని చేయడానికి కంకణం కట్టుకున్న ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు టిపూ విశిష్ట వ్యక్తిత్వం, ఆయన విధానాల మీద చేసిన ప్రశంసనీయ వ్యాఖ్యలను ఆయన చక్కగా వినియోగించుకున్నారు.

టిపూ సుల్తాన్ మీద ప్రచారంలో ఉన్న అతి ప్రధాన ఆరోపణలను ప్రస్తావిస్తూ, టిపూ చర్యలను మతోన్మాద స్వార్థపరశక్తులు ఏవిధంగా వక్రీకరించింది ఈ గ్రంథం తగినన్ని రుజువులతో స్పష్టపరిచింది. లౌకిక ప్రభువుగా ఖ్యాతి గడించిన టిపూను అపఖ్యాతి పాల్జేయడానికి, మూడు వేల బ్రాహ్మణుల ఆత్మహత్యకు ఆయన కారణమయ్యాదని కలకత్తా విశ్వవిద్యాలయం సంస్కృత విభాగాధిపతి డాక్టర్ హరిప్రసాద శాస్త్రి దురుద్దేశ్యపూర్వకంగా చేసిన అసత్య ఆరోపణలను వివరించి, ఆ ఆరోపణలను ప్రముఖ చరిత్రకారుడు డాక్టర్ బి.యన్.పాండే ఏ విధంగా బలమైన ఆధారాలతో శ్రీశాస్త్రి రాసిన ఆరోపణలను తిప్పికొట్టిన తీరుతెన్నులను రచయిత విస్పష్టంగా పేర్కొన్నారు. జన జీవనంలో సభ్యత - నైతిక విలువల పరిరక్షణకు టిపూ చూపిన ఆసక్తి, అందుకుగాను ఆయన చేపట్టిన సంస్కరణలు, ఆ సంస్కరణల అమలుకు ఆయన తీసుకున్న చర్యలను కూడా వక్రీకరిస్తూ, టిపూ సుల్తాన్‌ను పచ్చి మతోన్మాదిగా, క్రూరునిగా, నిరంకుశుడిగా దృశ్యీకరించేందుకు కొందరు విదేశీ-స్వదేశీ చరిత్రకారులు ఉద్యేశ్యపూరితంగా చేసిన ప్రయత్నాలను ఈ గ్రంథంలో విడమర్చి వివరిస్తూ, తగిన ఆధారాలతో ఆ ఆరోపణలను రచయిత తిప్పిగొట్టారు.

టిపూను జనరంజక పాలకునిగా పేర్కొంటూ, ఆయనలోని సుగుణాలను



వివరిస్తూనే, పాలక వర్గాల చర్యలకు వ్యతిరేకంగా వ్యవహరించిన వారి పట్ల ప్రభువులు ఏవిధంగా ప్రవర్తిస్తారో అందుకు భిన్నంగా టిపూ సుల్తాన్ ఏమాత్రం ప్రవర్తించలేదని, ఆనాటి ఇతర ప్రభువుల్లాగే ప్రభుత్వ వ్యతిరేకుల పట్ల టిపూ కూడా కఠినంగా, క్రూరంగా వ్యవహరించాడని పేర్కొన్నారు. ఈ విధంగా టిపూలోని అన్ని పార్శ్వాలను దృశ్యీకరిస్తూ, తద్వారా చారిత్రక వ్యక్తుల వ్యక్తిత్వాలను ఆవిష్కరణలో నిష్పాక్షికత, సమతౌల్యం పాటించటం, రచయిత నిజాయితీ ఈ గ్రంథంలో కన్పిస్తుంది.

ఈ గ్రంథంలో కేవలం టిపూ సుల్తాన్‌కు సంబంధించిన విలువైన సమాచారాన్ని అందించటం మాత్రమే కాకుండా, టిపూకు సంబంధించిన అపూర్వమైన ఫోటోలను, చిత్రాలను కూడా రచయిత ఎన్నో వ్యయప్రయాసలకోర్చి, సేకరించి పొందుపర్చారు. టిపూ నిర్మించిన మస్జిద్-ఎ-ఆలా, టిపూ అనునిత్యం సందర్శించే శ్రీరంగనాథస్వామి ఆలయం ఫోటోలు, టిపూ స్వదస్తూరి, మూడవ మైసూరు యుద్ధం నష్టపరిహారం కోసం తన బిడ్డలను పూచీకత్తుగా ఆంగ్లేయులకు అప్పగిస్తున్న చిత్రం, ఆయన ఆరుగురు కుమారుల చిత్రాలు, నాల్గవ మైసూరు యుద్ధంలో ప్రాముఖ్యత సంతరించుకున్న శ్రీరంగపట్నం కోటలోని వాటర్ గేటు, యుద్ధరంగంలో టిపూ నేల కూలిన స్థలం, ఆయన స్మారక స్థూపం, శిధిలమైన టిపూ ప్రాసాదం, హైదర్ అలీ-టిపూ సుల్తాన్‌ల సమాధుల ఫోటోలు, చిత్రాలు ఈ గ్రంథం విలువను మరింతగా పెంచాయి.

ముస్లింలకు వ్యతిరేకంగా మతోన్మాద-రాజకీయ శక్తులు ఈనాడు సాగిస్తున్న దుష్ప్రచారం వలన మన దేశంలోని విభిన్న సాంఘిక జనసముదాయాల మధ్య ఏర్పడుతున్న మానసిక అఘాతం గోద్రా-గుజరాత్ లాంటి భయంకర సంఘటనలకు ప్రజలను పురికొల్పుతున్నందున, ఆనాడు మాతృభూమి విముక్తి కోసం ముస్లిం జనసముదాయాలు సాగించిన అసమాన పోరాటాలను, ఆ పోరాటాలలో పాల్గొన్న యోధులను, ఆ తరువాత మాతృదేశం అభివృద్ధి పథంలో మున్ముందుకు సాగిన కృషిలో భాగస్వాములైన ముస్లిం ప్రముఖుల కృషిని అందరికి ఎరుకపర్చాల్సిన అవసరం ఎంతో ఉంది. ఈ దిశగా కృషి జరిగి తగినంత సాహిత్యం సామాన్య ప్రజలకు అందుబాటులోకి వచ్చినట్టయితే ఆయా సాంఘిక జనసముదాయాల పట్ల పెంచిపోషించబడుతున్న అపోహలు- అపార్థాలు దూరమవుతాయి. ఆ మంచి వాతావరణంలో ఒక సామాజిక జన సముదాయం పట్ల మరొక జనసముదాయంలో గౌరవభావం అంకురించి సామరస్య-సహిష్ణుత భావనలు మరింతగా పటిష్టమవుతాయని ఆకాంక్షిస్తూ, ఆ దిశగా తెలుగులో చరిత్ర రచనలను అందిస్తున్న రచయిత అభినందనీయులు.

◆◆◆

# నా మాట

బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో ప్రధాన పాత్ర వహించి మైసూరు పులిగా ప్రఖ్యాతిగాంచిన టిపూ సుల్తాన్ జీవిత విశేషాలను తెలుగు పాఠకులకు పరిచయం చేయాలన్న సంకల్పంతో **మైసూరు పులి : టిపూ సుల్తాన్** రాశాను. ఈ సమాచారం గీటురాయి వారపత్రికలో ధారావాహికంగా ప్రచురితమైంది. ఈ సీరియల్‌ను చదివిన పాఠకులు పలువురు దీనికి పుస్తక రూపం కల్పించమన్నారు. ఆ పాఠకుల కోరిక మేరకు 2002లో మిత్రులు జనాబ్ హబీబుర్ రహ్మాన్ (విజయవాడ) సహకారంతో **ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్** పుస్తకంగా వెలువరించింది.

ఈ చిన్న పుస్తకాన్ని పెద్ద మనస్సుతో పాఠకులు ఆదరించారు. పత్రికలు చక్కని సమీక్షలతో ప్రజలకు పరిచయం చేశాయి. ఆనాడు **తెలుగు జీవిత గాథల్లో గొప్పగా వచ్చిన పుస్తకం** అంటూ పండితుల ప్రశంసలందుకున్న ఈ పుస్తకానికి పాఠకుల నుండి లభించిన మరింత ఆదరణ మూలంగా 2004 లో **ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్** పునర్ముద్రించింది.

ఆ సమయంలో కర్ణాటక ప్రాంతంలో కొన్ని మతోన్మాద స్వార్థపరశక్తులు టిపూ సుల్తాన్ గురించి అపప్రధలను ముమ్మరంగా ప్రచారం చేస్తున్నందున, ప్రజలకు వాస్తవాలు తెలపాలన్న ఉద్దేశ్యంతో ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్ ఛైర్మన్, హాజీ షేక్ పీర్ అహమ్మద్, ఈ పుస్తకాన్ని కర్ణాటకలోని తెలుగు ప్రజలు నివసించే ప్రాంతాలకు పంపి, మిత్రులద్వారా ఉచితంగా పంపిణీ చేయించారు. మన రాష్ట్రంలో కూడా చాలా వరకు ఉచితంగా పంపిణి జరిగింది. ప్రధానంగా రాయలసీమ ప్రాంత ప్రజలకు ఈ పుస్తకాన్ని అందించారు.

ఆ తరువాత **తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్** వారు **మైసూరు పులి: టిపూ సుల్తాన్** పుస్తకాన్ని సరికొత్తగా ప్రచురించ సంకల్పించారు. ఆ సంస్థ సంచాలకులు జనాబ్ అబ్బాదుల్లాగారు, అలనాటి పుస్తకాన్ని పూర్తిగా తిరగరాసి నూతన



సమాచారం, నూతన చిత్రాలు, ఫోటోలు సమకూర్చాలని తిరుగులేని షరతు విధించారు. ఆయన విధించిన షరతులను గౌరవిస్తూ, నా పుస్తకాన్ని చదివిన చరిత్ర ఆధ్యాపకులు, పరిశోధకులు, పాఠకులు సూచించిన ప్రమాణాలను పాటిస్తూ, ప్రస్తుతం మీ చేతుల్లో ఉన్న పుస్తకాన్ని రూపొందించాను.

ఈ లోగా ఈ పుస్తక రచనలో తోడ్పాటుకోసం స్వయంగా టిపూ సుల్తాన్ రాజ్య రాజధాని శ్రీరంగపట్నం మరోమారు వెళ్ళివచ్చాను. శ్రీరంగపట్నంలోని ప్రతి ప్రదేశాన్ని మళ్ళీమళ్ళీ సందర్శించాను. ఆయా ప్రాంతాల చిత్రాలను, ఫోటోలను సేకరించుకున్నాను. ఆ ఫోటోలు, చిత్రాలతో సహా సరికొత్త సమాచారం పొందు పర్చుకున్న కారణంగా ప్రస్తుతం మీ చేతుల్లో ఉన్న ఈ పుస్తకం పూర్తిగా సరికొత్త పుస్తకమయ్యింది.

ఈ కృషిలో నాకు సహకారం అందించిన తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, హైదరాబాదు సంచాలకులు **జనాబ్ అబ్బాదుల్లా** గారికి, పరిచయ వాక్యం రాసిచ్చిన పుస్తక ప్రచురణలో సహకరించిన మిత్రులు **జనాబ్ వాహెద్** (గీటురాయి) గారికి, పరిచయ వాక్యం రాసిచ్చిన ప్రముఖ రచయిత, కవి శ్రీ యం.డి. సౌజన్య (తెనాలి) గారికి, టిపూ సుల్తాన్ కుటుంబం, చరిత్రకు సంబంధించిన చిత్రాలు, ఫోటోలు సేకరిం చటంలో నాకు ఎంతగానో సహకరించిన పుస్తక ప్రియులు, నా మిత్రులు జనాబ్ యస్. ఖాన్ సాహెబ్ (అసిస్టెంట్ కమీషనర్, కస్టమ్స్ అండ్ ఎక్సయిజ్, బెంగుళూరు) గారికి, నా ప్రతి ప్రయత్నం వెనుక తానుండి సతతం నన్ను ప్రోత్సహిస్తున్న నా జీవిత సహచరిణి **శ్రీమతి రమిజా బాను**కు, నా ప్రత్యేక ధన్యవాదాలు.

**ఇక ఈ గ్రంథం గురించి తీర్పు చెప్పాల్సింది పాఠకులే !**

వినుకొండ,
మే, 2006.

**- సయ్యద్ నశీర్ అహమ్మద్**



# మైసూరు పులి
# టిపూ సుల్తాన్

**భా**రతదేశ రాజకీయ చరిత్రలో పద్దెనిమిదవ శతాబ్దపు ఉత్తరార్థ భాగం ఎంతో కీలకమైన సమయం. బెంగాల్ నవాబు సిరాజుద్దౌలాను పరాజితుడ్ని చేసి, బెంగాల్ దివానిని హస్తగతం చేసుకున్న ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు, దక్షణాదిని ఆక్రమించు కోవటానికి యుక్తులు, కుయుక్తులు పన్నుతున్నారు. ఈ సామ్రాజ్యవాద శక్తుల రాజ్యవిస్తరణ కాంక్షను అర్థం చేసుకోని స్వదేశీపాలకులు పరస్పరం కలహించుకుంటున్నారు. ఈ సమయంలో **నేనున్నా...నేనున్నా** అంటూ భారత రాజకీయ చిత్రపటం మీద ఉదయించా డొక భానుడు. ఆ మొనగాడే, ప్రముఖ చరిత్రకారుడు జేమ్స్ మిల్ **(James Mill)** చే **THE GREATEST PRINCE OF THE EAST** గా కీర్తించబడిన, దక్షణ భారత దేశ చరిత్రలో మధ్యాహ్న మార్తాండుడిగా వెలుగొందిన, **మైసూరు పులి** గా ఖ్యాతిగాంచిన టిపూ సుల్తాన్.






టిపూ జన్మస్థలం

ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల పెత్తనాన్ని సవాల్ చేసి, ఈ గడ్డ మీద నిలదొక్కుకుంటున్న బ్రిటీషర్లను తొడగొట్టి సవాల్ చేసిన టిపూ సుల్తాన్ 1750 నవంబర్ 10వ తేదీన కర్ణాటక రాష్ట్రంలోని కోలార్ జిల్లా దేవనహళ్ళి గ్రామంలో జన్మించారు. అసమాన ధైర్యసాహసాలతో **దక్షిణ భారత దేశపు నెపోలియన్**గా ఖ్యాతి గాంచిన, అరివీర భయంకరుడు. మైసూరు పాలకుడు హైదర్ అలీ, శ్రీమతి ఫాతిమా ఫక్రున్నిసాలు టిపూ తల్లిదండ్రులు. ఆర్కాట్‌కు చెందిన ప్రముఖ సూఫి తత్వవేత్త మస్తాన్ ఔలియా అనుగ్రహం వలన టిపూ తమకు కలిగాడని భావించిన తల్లితండ్రులు, ఆయనను స్మరించుకుంటూ **టిపూ** అని ముద్దుగా పిలుచుకున్నారు. టిపూ తాతయ్య పేరు ఫతే ముహమ్మద్. ఆయన జ్ఞాపకార్థం,అయన మీద ఉన్న గౌరవం కొద్ది టిపూకు **ఫతే అలీ** అని పేరు పెట్టారు.

విద్యాగంధం లేని హైదర్, తన బిడ్డ మాత్రం పండితుడు, యుద్ధ విద్యలలో ప్రవీణుడు కావాలని సంకల్పించి, టిపూకు మంచి విద్యాబుద్ధులు చెప్పించారు. తండ్రి ప్రత్యేక పర్యవేక్షణలో యుద్ధ కళను టిపూ ఔపోసన పట్టారు. ఆనాటి ప్రముఖ యోధులలో అగ్రగామిగా గుర్తింపు పొందారు. చిన్నతనం నుండి తండ్రి నాయకత్వంలో సాగిన పలు యుద్ధాలలో పాల్గొన్నారు. ఏ అంశానికి సంబంధించినదైనా, ఎటువంటి విశిష్ట, సాంకేతిక సమాచారమైనా అధ్యయనం చేసిన ఆకళింపు చేసుకోవటం నూతనత్వాన్ని అను నిత్యం ఆహ్వానించటం టిపూ ప్రత్యేకత. భారతీయ, పాశ్చాత్య తత్వవేత్తల, రాజనీతిజ్ఞుల గ్రంథాలను సేకరించి అధ్యయనం చేశారు. ఈ విధంగా సేకరించిన అపూర్వ గ్రంథాల అధ్యయనం ద్వారా సంపాదించుకున్న పరిజ్ఞానం, సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిణామాల మీద టిపూ సాధికారికంగా చేసినటువంటి విశ్లేషణలు, ఫ్రెంచ్, ఆంగ్లేయాధికారులను ఆశ్చర్యచకితులను చేసేవి. జాతీయ, అంతర్జాతీయ వ్యవహారాల గురించి టిపూ వ్యక్తం చేసిన అభిప్రాయాలు, దౌత్యవ్యూహాలను, బ్రిటీష్ అధికారి డావ్‌టన్ **(Doveton)** లాంటి ప్రముఖుడు ప్రత్యేకంగా ప్రశంసించక తప్పలేదు.

# పదిహేనేళ్ళకే యుద్ధ వీరుడు

పదిహేను సంవత్సరాల వయస్సు వచ్చేసరికి రాజ్యపాలన వ్యవహారాలలో, తండ్రితోపాటుగా యుద్ధాలలో పాల్గొన గలిగిన స్థాయినీ, సామర్థ్యాన్నీ సంపాదించుకున్న టిపూ 1763లో జరిగిన మలబార్ పోరాటంలో తొలిసారిగా పాల్గొన్నారు. 1769-72 వరకు మరాఠాలతో సాగిన యుద్ధాలలో పాల్గొని, అసమాన ధైర్యసాహసాలు ప్రదర్శించారు. తండ్రికి తగిన తనయుడు అన్పించుకున్నారు. ప్రథమ మైసూరు యద్ధంలో బ్రిటీషర్ల కూటమి నుండి నిజాం నవాబును దూరం చేసేందుకు సాగిన ప్రయత్నాలలో భాగంగా ఎంతో చాకచక్యంగా దౌత్యం నడిపి 17 సంవత్సరాల టిపూ విజయం సాధించారు. ఆనాడు టిపూ ప్రదర్శించిన రాజనీతికి ముగ్ధుడైన నిజాం, టిపూను **ఫతే అలీ ఖాన్** బిరుదుతో సత్కరించి గౌరవించారు.


హైదర్ అలీ

తండ్రిలాగే యుద్ధ కళలో ప్రావీణ్యత సంపాదించిన టిపూ పురాతన సంప్రదాయ యుద్ధ రీతులను అనుసరిస్తూ, పాశ్చాత్య యుద్ధ వ్యూహాలకు అనుగుణంగా సైన్యాన్ని ఆధునీకరించి మంచి తర్ఫీదు ఇప్పించారు. సరికొత్త ఆయుధాలను యుద్ధవ్యూహాలను రూపొందించి విజయాలకు రాచబాట వేసారు. 1780లో కల్నల్ హాంబర్ స్టోన్‌ని తరిమి కొట్టిన చారిత్రక సంఘటనలో ప్రముఖ పాత్ర వహించారు. ఈ ఓటమిని దృష్టిలో పెట్టుకొని, ప్రఖ్యాత ఆంగ్ల సేనానులు జనర్ లారెన్స్, రాబర్ట్ క్లైవ్ సైన్యాల కంటె బలమైన సైన్యాలను కలిగి ఉన్న తమకు మొదటిసారిగా భారతీయ సైన్యాలను ఎదుర్కొనలేక పారిపోవాల్సిన పరిస్థితి దాపురించిందని, ప్రస్తుతం టిపూ సైన్యాల ఎదుట నిలువలేక వెన్ను చూపాల్సిన దుస్థితి కలిగిందని, ఆంగ్లేయ సైనికాధికారి జనరల్ గ్రాంట్ పేర్కొన్నాడు.

('An English army much superior to one which under a Lawrence or Clive, five and twenty years ago, made Hindoostan, nay some of powers of Europe tremble at the bare fact of its victories, now for the first time were retreating in the face of an Indian army.' -TIPU SULTAN : HIS VISION AND MISSION, By Prof. B. Sheik Ali, Published in Radiance Views Weekly 1-7 August 1999, Page .14)





# రాజ్యాభిషేకం

మైసూరును దక్షణాదిలో బలిష్టమైన రాజ్యంగా రూపొందించాలని కలలుగన్న హైదర్ అలీ శత్రువుల దాడుల నుండి రాజ్యాన్ని కాపాడుకునేందుకు, తన జీవితంలోని అత్యధిక కాలం రణభూమిలోనే గడిపారు. శత్రువుతో కలబడుతూనే 1782 నవంబరు 6న, రణరంగంలో తుదిశ్వాస వదిలారు. ఈ విషాద వార్త టిపూకి అందేనాటికి ఆయన మలబార్ తీరాన కల్నల్ హంబర్ స్టోన్‌ను తరిమి తరిమి కొడుతున్నారు. తండ్రి కన్ను మూసిన వార్త విన్న టిపూ సత్వరమే శ్రీరంగపట్నం చేరుకుని, తన 31వ ఏట 1782 డిసెంబర్ మాసంలో మైసూరు రాజ్యలక్ష్మిని చేబట్టారు. చిన్న వయస్సులోనే శౌర్యప్రతాపాలతో ప్రజలను ఆకట్టుకున్న టిపూ, **మైసూర్ సుల్తాన్** అయ్యారు. టిపూ రాజ్యధికారం చేపట్టడమైతే సులభంగా జరిగింది కాని, దక్షిణ బారతదేశంలో మైసూర్ బలమైన స్వతంత్ర రాజ్యంగా రూపొందటం ఇష్టంలేని నిజాం, మరాఠా పాలకుల నుండి తీవ్రమైన ఇబ్బందులను ఎదుర్కోవాల్సి వచ్చింది. మైసూరు రాజ్యలక్ష్మిని కాపాడుకోవటం కోసం, టిపూ డేగ కళ్ళతో రాజ్యంలోని ప్రతి ప్రాంతాన్ని కడు జాగ్రత్తగా రక్షించుకోవాల్సి వచ్చింది.


టిపూ తండ్రి హైదర్ అలీ

ప్రజల అండదండలు ఉన్నట్టయితే ఎటువంటి బలమైన శత్రువునైనా అతి తేలిగ్గా ఎదుర్కోవచ్చని ఆయన భావించారు. ప్రభువుకు ప్రజల శక్తి ఎంతటి అవసరమో గ్రహించిన ఆయన ఆ దిశగా తన రాజకీయ-పరిపాలనా విధానాలను రూపొందించు కున్నారు. ఆ కారణంగా, ప్రజల సంక్షేమంలో రాజ్యక్షేమం, రాజు సంక్షేమం దాగుందన్న సత్యాన్ని అర్థం చేసుకున్న టిపూ సుల్తాన్ తన రాజ్యాభిషేకం రోజుననే ప్రజల నుద్దేశించి మాట్లాడుతూ, **మిమ్ముల్ని వ్యతిరేకించినట్టయితే నేను నా స్వర్గాన్ని, నా జీవితాన్ని, నా సంతోషాన్ని కోల్పోవచ్చు. నా ప్రజల సంతోషంలోనే నా సంతోషం వారి సంక్షేమంలోనే నా సంక్షేమం ఇమిడి ఉంది. నాకిష్టమైందల్లా మంచిదని నేను భావించను. నా ప్రజలకు ఏది ఇష్టమో దానిని నా మంచిదిగా భావిస్తానని** ఆయన ప్రకటించారు.

('May I be deprived of heaven, of life, off spring if I oppose you. In the happiness, in their welfare my welfare; whatever pleases myself I shall consider not good, but whatever pleases my subjects I shall consider as good..' - AURUNGZEB AND TIPU SULTAN, Evolution of their Religious Polices, by Dr.B.N. Pande, IOS, New Delhi, 1996, Page. 21)

## జనరంజక రాజ్యపాలన

ఒకవైపు టిపూను దెబ్బతీయడానికి అదను కోసం ఎదురు చూస్తున్న స్వదేశీ శత్రువులు, మరొకవైపు పరాజయాల పరంపరతో రగిలిపోతున్న విదేశీ శత్రువులతో మైసూరు రాజ్యం చుట్టుముట్టబడి ఉండటంతో, శ్వాస పీల్చుకోవటానికి కూడా తీరిక లేనప్పటికీ, ప్రజారంజకమైన పాలనను అందిస్తూ, ప్రజల ఆర్థిక వ్యవహారాలలో టిపూ చూపిన శ్రద్ధను గమనించిన ఆంగ్లేయాధికారి గ్రాంట్, ఆయన చర్యలను ప్రశంసిస్తూ **టిపూ తన రాజ్యం యొక్క ఆర్థిక వ్యవహారాలను నిర్వహించిన తీరు అందరికి ఆదర్శంగా నిలచిపోతుందని,** ('...How Tipu organised the economic resources of the kingdom set an example...') అనటం విశేషం. ప్రతిభావంతంగా ఆయన ఆర్థిక వ్యవహారాలను చక్కదిద్దటం వలన రాజ్యంలో ప్రజలు సుఖ-శాంతులతో జీవనం సాగించగలిగారు.

ప్రజల జీవితాలను సుఖమయం చేసేందుకు టిపూ విన్నూత విధానాలను అనుసరించారు. పాశ్చాత్య సాంకేతిక పరిజ్ఞానాన్ని అన్ని రంగాలకు వర్తింపచేసారు. అన్ని ప్రభుత్వ విభాగాలలో ప్రజలకు సంబంధించిన అన్ని రంగాలలో పలు విప్లవాత్మక మార్పులు చేసారు. స్వదేశంలోనే కాకుండా, విదేశాలలో కూడా పరిశ్రమలను స్థాపించి





అభివృద్ధిపర్చారు. పలు ప్రాంతాలనుండి చేతి వృత్తి కళాకారులను, నిపుణులను మైసూరు రాజ్యానికి రప్పించి తన ప్రజలకు, శ్రామికులకు ప్రత్యేక శిక్షణ ఇప్పించారు.

అన్ని వర్గాల ప్రజల అభివృద్ధి కోసం పలు నూతన పథకాలను ఆవిష్కరించి ఆ పథకాలు సమర్ధవంతంగా అమలు జరిగేలా తగిన జాగ్రత్తలు తీసుకున్నారు. నూతన తరహా సహకార బ్యాంకులను ఏర్పాటు చేసారు. సంపన్న వర్గాల పెత్తనం తగ్గించేందుకు ఎక్కువ మొత్తాలను బ్యాంకులలో వాటాలుగా పొదుపు చేసినవారికి లాభాలలో వాటాను తగ్గించారు. పేద వర్గాలను పొదుపు వైపుకు ఆకర్షించేందుకు తక్కువ మొత్తాలను లాభాలుగా ప్రకటించారు. ప్రజలలో పొదుపును, మదుపును ప్రోత్సహించారు.

వర్తక-వాణిజ్య రంగాన్ని తీర్చిదిద్దారు. తూనికలు-కొలతల వ్యవస్థను ఆధునీకరించారు. ప్రజలు మోసాలకు గురికాకుండా తగిన కట్టుదిట్టమైన చర్యలను తీసుకున్నారు. వర్తక, వాణిజ్య పారిశ్రామిక రంగాలలో ప్రభుత్వ పాత్రను అధికం చేసారు. వర్తక-వాణిజ్య రంగాలలో ప్రభుత్వ పాత్రను అధికం చేసేందుకు టిపూ సుల్తాన్ ఆనాడే ప్రభుత్వం ద్వారా వ్యాపారాన్ని నిర్వహింప చేశారు. ఈ మేరకు ప్రభుత్వ వ్యాపార సంస్థను ( State Trading Corporation) ఏర్పాటు చేశారు.

టిపూ విదేశీ వ్యాపారం అభివృద్ధికి ఎంతో కృషి చేశారు. స్వదేశ ఉత్పత్తులను విదేశాలకు ఎగుమతి చేయడాన్ని ప్రోత్సహించటమే కాకుండా, ఎగుమతులను సులభతరం చేసేందుకు ఆయన నౌకా వ్యాపారం కోసం నౌకా స్థావరాన్ని నిర్మించారు. ఈ విధంగా వ్యాపారాభివృద్ధి లక్ష్యంగా వ్యాపార నౌకల నిర్మాణం చేపట్టిన ప్రథమ పాలకునిగా ఖ్యాతిగాంచారు.

(Tipu was the first ruler to build merchant navy - Prof. Shaik Ali in his essay ' Tipu's Development Projects and Administrative Machinery, published in Radiance 1-7, Aug. 1999, Page.28)

1793 లో వంద నౌకల నిర్మాణానికి సంకల్పించారు. ఈ మేరకు నిర్మాణమైన రెండు నౌకలకు 'KHIZRI' మరియు ' HYAS ' అని ఆయన స్వయంగా నామకరణం చేశారు. ఈ నౌకల నిర్మాణానికి అవసరమైన ముడిపదార్థాలను స్వదేశంలో సమకూర్చుకుంటూ, సాంకేతిక పరిజ్ఞానాన్ని విదేశాల నుండి స్వీకరించారు. ఈ నౌకల నిర్మాణాలకు ప్రసిద్ధిగాంచిన వివిధ దేశాలలోని ఆయా వ్యవస్థల సమాచారం తెప్పించుకుని అధ్యయనం చేసి ప్రతి వ్యవస్థలోని ప్రగతిశీల అంశాన్ని గ్రహించి దానిని స్వదేశీ

వ్యవస్థకు అన్వయించారు. సముద్ర తీరం సరిహద్దులుగా గల ప్రాంతాల నుండి నావికాదళం ఏర్పాటుతో రాజ్య రక్షణకు నడుంకట్టాలని టిపూ ఆలోచించారు. ఈ దిశగా కూడా ఆయన తగిన చర్యలు చేపట్టారు. యుద్దరంగంలో కూడా నౌకలను వినియోగించేందుకు అవసరమైన శిక్షణ కోసం ఆయన ప్రత్యేకంగా కళాశాలను ఏర్పాటు చేశారు. 1793లో ప్రసిద్ద వ్యాపార కేంద్రమైన భట్‌కల్ వద్ద ఆయన Naval College ప్రారంభించారు.

ఎగుమతుల- దిగుమతుల వ్యాపారా నికి ఆయన ఎంతటి ప్రాముఖ్యతనిచ్చారో, అంతే ప్రాముఖ్యత రాజ్యరక్షణకు ఇచ్చారు. యుద్ధరంగంలో నావికాదళం నిర్వహించే ప్రత్యేక ప్రాధాన్యత దృష్ట్యా యుద్ధ నౌకల నిర్మాణం, సైన్యానికి శిక్షణ కోసం ఆయన పటిష్టమై ఏర్పాట్లు చేశారు. (Eminent Muslim Freedom Fighters, G. Allana, Low Price Publications, Delhi, 1993, Page. 75)

## వ్యవసాయ రంగానికి ప్రాధాన్యత

టిపూ వ్యవసాయ రంగాన్ని ఎంతగానో ప్రోత్సహించారు. నీటి పారుదల సౌకర్యం కల్పించేందుకు అధిక శ్రద్ధ చూపించారు. పన్ను విధింపు పద్దతిలో మార్పులు చేశారు. పన్ను అనేది భూమి విస్తీర్ణం మీద ఆధారపడి కాకుండా, ఉత్పత్తి మీద ఆధారపడి నిర్ణయించారు. అంతే కాదు వర్షం నీటి ఆధార భూములు, నీటి పారుదల ఆధారిత భూములకు వేర్వేరుగా విభజించారు. పంట సిరులు అందించే రైతుకు భూమి మీద హక్కు కల్పించారు. జాగీర్దారి జులుంకు చరమగీతం పాడారు. బంజరు భూములను మాగాణులుగా మార్చే రైతులు, మూడు సంవత్సరాల పాటు ఎటువంటి పన్నులు చెల్లించాల్సిన అవసరం లేదని పన్ను రాయితీలు కల్పించారు. పన్నుల వసూలుకు మధ్య దళారీలను తొలగించి ప్రభుత్వ ఉద్యోగులను నియమించారు. వ్యవసాయ పనిముట్ల కొనుగోలు కోసం రైతులకు రుణ సౌకర్యం కల్పించారు. నీటి పారుదల కోసం పలు చర్యలు చేపట్టారు. నాడు కావేరి నది మీద ఎక్కడయితే నీటిపారుదలకు ప్రాజెక్టు కట్టాలని టిపూ ఉద్దేశించారో, అక్కడే ఈనాడు కృష్ణరాయసాగర్ నిర్మాణం కావటం విశేషం.

టిపూ జనరంజక పాలనలో అన్ని వర్గాల ప్రజలు సుఖశాంతులతో జీవించారు. ఈ విషయాన్ని ప్రముఖ చరిత్రకారుడు జేమ్స్ మిల్ తన History of British India **భారతదేశంలోని ఇతర ప్రాంతాల ప్రజలందరి కంటే టిపూ రాజ్యంలోని ప్రజలు సంతోషంగా ఉన్నారు. పంటలు బాగా పండాయి** అని పేర్కొన్నాడు. టిపూ సుల్తాన్





అంటే ప్రత్యేక అభిమానం అంటూ ఏమీ లేని ఈ ఆంగ్లేయ చరిత్రకారుడు అంతటితో సరిపెట్టుకోలేదు. ఆ కాలంలో **ఆంగ్లేయుల, వారి వత్తాసుదారుల పాలన క్రింద ఉన్న కర్నాటక, ఔద్ రాజ్యాలు అత్యంత వేగంగా ఎడారులుగా మారనున్నాయంటూ,** కూడా పేర్కొనటం విశేషం.

('...there were good crops in Tipus regime and his subjects were happier than all others in India... the best cultivated and its population the most flourishing in India. while under English and their dependencies, the population of the Carnatic and Oudh, hasting to the state of deserts, were the most wretched upon the face of the earth ' - TIPU SULTAN : HIS VISION AND MISSION, By Prof. B. Sheik Ali, Published in Radiance Views Weekly 1-7 August 1999, Page. 13 )

టిపూ వ్యవసాయ రంగం, ఆ రంగానికి అనుబంధంగా ఉన్న రంగాలకు అత్యధిక ప్రాధాన్యత నిచ్చి తగిన చర్యలను పటిష్టంగా అమలు పర్చినందున మైసూరు రాజ్యం పలు యుద్ధాలను ఎదుర్కొన్నప్పటికి పాడి పంటలతో కళకళలాడింది. మైసూరు రాజ్యమంతా పచ్చదం పూర్తిగా పర్చుకుంది.

**అపరిచిత ప్రాంతంలో ఓ ప్రయాణికుడు ప్రయాణిస్తున్నప్పుడు, పచ్చని పొలాలు, శ్రమజీవులు, నూతనంగా నిర్మాణమైన నగరాలు, అభివృద్ధి చెందుతున్న వర్తక-వ్యాపారాలు, పెరుగుతున్న పట్టణాల సంఖ్య ఎక్కడైతే కన్పిస్తాయో, ఎక్కడైతే ప్రతిదీ సంతోషదాయకంగా దర్శనమిస్తుందో, ఆ ప్రాంతం ప్రజల అభిమతాలకు అనుగుణమైన ప్రభుత్వ పాలన క్రింద ఉందని నిర్ధారించుకోవచ్చు. అటువంటి రాజ్యం టిపూ రాజ్యం.** అంటూ ప్రఖ్యాత అంగ్లేయ చరిత్రకారుడు Edward Moore 1794 అభిప్రాయపడ్డారు.

ఈ అభిప్రాయం అతని రాతల్లో ఈవిధంగా ఉంది‘ ..When a person traveling through strange country finds it well cultivated populous with industrious inhabitants, cities newly founded, commerce extending, towns increasing and every thing flourishing so as to indicate happiness, he will naturally conclude it to be under form of Government congenial to the minds of people. This is a picture of Tipus's country, and our conclusion respecting its Government. ( BN Pandy Page.16.)

టిపూ ఆంగ్లేయులను ఈ గడ్డ నుండి తరిమి వేయాలని సంకల్పించి పోరాడుతుండగా, ఆంగ్ల చరిత్రకారులు ఆయన పాలన-పద్దతుల గురించి చేసిన వ్యాఖ్యానాలు, అభిప్రాయలు గమనిస్తే టిపూ పాలన ఎంత జనరంజకంగా ఉందో, రాజ్యం మరెంత పచ్చగా ఉందో, ప్రజలు ఎంతటి సుఖశాంతులతో గడిపారో మనకు అర్థం అవుతుంది.

## పారిశ్రామిక రంగంలో అగ్రగామి

ప్రజల సంక్షేమంలో తన సంతోషం ఉందని నమ్మిన ప్రభువు కావటంతో ప్రజల ప్రగతికి అవసరమైన అన్ని రంగాల మీద ఆయన దృష్టి సారించారు. ఆయా రంగాలలో అభివృద్ధిని సాధించేందుకు, ఆయా రంగాలలో నూతన పోకడలను, పరిజ్ఞానాన్ని ప్రవేశ పెట్టేందుకు టిపూ ఎంతగానో శ్రమించారు.

టిపూ వర్తక వాణిజ్యాభివృద్ధితో పాటు విదేశాలలో కర్మాగారాలను స్థాపిం చేందుకు కృషి సల్పారు. ఈ విషయమై చక్కని దౌత్యం నడిపి విదేశీ నేతలను అంగీకరింప చేశారు. ఆ దేశాల సాంకేతిక పరిజ్ఞానాన్ని స్వదేశానికి రాబట్టటంలో ఆయన విజయం సాధించారు.

ఈ మేరకు స్వదేశంలో పరిశ్రమల స్థాపనకు పలుచర్యలు తీసుకున్నారు. ఔత్సాహికులకు ఆయన ప్రోత్సాహకాలు ప్రకటించారు. పారిశ్రామిక రంగం పట్ల, పారిశ్రామిక ఉత్పత్తుల పట్ల ప్రత్యేక ఆసక్తి చూపారు. ఈ రంగం అభివృద్ధికి ఆయన నిపుణులైన విదేశీ కార్మికులను రప్పించి ప్రజలకు శిక్షణ ఇప్పించారు. శ్రీరంగపట్నం, చిత్రదుర్గ, బెంగళూరు, బెద్నూర్‌లలో కర్మాగారాలను ఏర్పాటు చేయించారు. ఈ కర్మాగారాలలో యుద్ధ సామగ్రితోపాటుగా, గృహోపకరణాలు, కత్తులు, వాచీలు లాంటివి కూడా తయారు చేయించారు.

ఉత్పత్తిదారుడు, వినియోగదారుని మధ్య దళారులను వీలయినంతగా తొలగించ ప్రయత్నించారు. ఈ చర్యల వలన అటు ఉత్పత్తిదారులు, చేతి వృత్తుల కళాకారులు, కార్మికులకు ఇటు వినియోగదారులకు ఎంతో మేలు జరిగింది. ఆ కారణంగా అటు వ్యవసాయరంగం, ఇటు పారిశ్రామిక రంగం బాగా అభివృద్ధిచెందాయి.

ఏది చేసినా, ఏది చేయించినా అన్ని విషయాలు తన దృష్టిని దాటిపోనివ్వకుండా చూసుకోవటం ఆయన ప్రత్యేకత కావటంతో ప్రతిరంగం సమర్థవంతంగా రూపొందింది. టిపూ ప్రారిశామిక రంగం పట్ల చూపిన ప్రత్యేక ఆసక్తిని గమనించిన ఆంగ్లేయాధికారి P. Fernandes "... no other sovereign in Indian history had given such impetus to industrial production." అని అన్నాడు. ( TIPU SULTAN THE GREAT : Glimpses of His Work and Personality, essay By Mufthi Shamshuddin Ahemed, published RADIANCE Views Weekly, 1-7 Aug. 1999, Page. 35)







టిప్పూ రాజముద్ర

## ఆధునిక సూత్రాల కనుగుణంగా పాలన

(పాక్ – పశ్చిమ దేశాల సామాజిక, సాంకేతిక పరిజ్ఞానాన్ని సంతరించుకున్న టిపూ సంప్రదాయక ప్రభుత్వ పాలనకు భిన్నంగా, ప్రజలకు ఉత్తమ సేవలను అందచేసే ఆధునిక పద్ధతులను ప్రవేశ పెట్టిన తొలి స్వదేశీ పాలకుడిగా ఖ్యాతి గడించారు. ప్రభుత్వ యంత్రాగాన్ని పలు మార్పులకు గురిచేసారు. ప్రజల సంక్షేమమే ప్రధాన లక్ష్యంగా ప్రభుత్వం పనిచేయాలని వాంఛించిన టిపూ, పాలకుడిగా నిరంతరం ప్రజల శ్రేయస్సును ఆకాంక్షిస్తూ ఆ దిశగా పనిచేసారు. ఈ విధానాల వల్లనే టిపూను ప్రజలు అమితంగా ప్రేమించారు. టిపూ ఎదుర్కొన్న కష్టకాలంలో ఆయనకు తోడు నిలిచారు.

1792లో జరిగిన మైసూరు యుద్ధంలో యుద్ధ నష్ట పరిహారం కింద మూడున్నర కోట్ల రూపాయలను ప్రత్యర్థులకు టిపూ చెల్లించాల్సి వచ్చింది. ఆ సమయాన ప్రభుత్వ ఖజానా ఖాళీగా ఉంది. మంత్రుల సలహా మేరకు టిపూ ప్రజల సహకారాన్ని అర్థించగా, ప్రజలు అమితోత్సాహంతో ముందుకు వచ్చిన తమ వాటాగా మూడున్నర కోట్ల స్థానంలో పది కోట్ల రూపాయలను సమకూర్చారు. ఈ అనుకూల ప్రతిస్పందన బట్టి ప్రజలు టిపూను ఎంతగా ప్రేమించారన్న విషయంతోపాటు ప్రజలు ఎంతటి ఉన్నత ప్రమాణాలతో జీవితాలను గడిపారో గ్రహించవచ్చు.

టిపూపాలన ఆశ్చర్యంగా అత్యంత ఆధునిక సూత్రాలకు అనుగుణంగా సాగిందంటూ ప్రముఖ ఆంగ్లేయ చరిత్రకారుడు పి. ఫెర్నాండజ్ తన గ్రంథం 'Storm Over Srirangapatnam' లో బహువిధాల ప్రశంసించాడు. ఆయన సంక్షేమ రాజ్యం బలమైన కేంద్ర ప్రభుత్వం, పలు ప్రాంతాల సమన్వయ సమర్థపాలన, చక్కని న్యాయపాలనా

వ్యవస్థ ఏర్పాటు, దోపిడికి కారణమైన మధ్యవర్తుల ప్రమేయంలేని క్రియాశీలక పాలనా వ్యవస్థను రూపొందించారని ఆ ఆంగ్లేయుడు పేర్కొన్నాడు.

( “The administration of Mysore kingdom under Tipu Sulthan was surprisingly based on modern principles... Tipu Sultan’s welfare state was based on some fundamental principles - viz. A strong Central Government, a coordinated provincial administration, dynamic and good civil amenities, principled legal system and elimination of intermediary (exploiting) channels... “ TIPU SULTAN THE GREAT: Glimpses of His Work and Personality, By Mufthi Shamshuddin Ahemed, Published in Radiance Views Weekly 1-7 August 1999, Page. 35)

ప్రభుత్వాధికారులను ప్రజలకు చేరువ చేయటం, ప్రజలను కూడా ప్రభుత్వ కార్యకలాపాలలో భాగస్వాములను చేసేందుకు టిపూ ప్రత్యేకమై పద్ధతులను అనుసరించారు. ప్రతి నూతన సంవత్సరం తొలి రోజున అధికారులు తమ తమ ప్రధాన కార్యాలయాలు గల ప్రాంతాలలో ప్రత్యేక కార్యక్రమాలను నిర్వహించాలని ఆదేశించారు. బహిరంగ సభలను నిర్వహించాలని, ఆ సభలలో బాధ్యులైన అధికారులందరు పాల్గొన్నాలని ఆజ్ఞలు జారీ చేశారు. ఈ సందర్భంగా తమతమ పరిధిలలో గల ప్రజలను ఆహ్వానించి నూతన సంవత్సర శుభాకాంక్షలు చెప్పాలని, ఆ విధంగా వచ్చిన ప్రజల గౌరవార్థం సుగంధ ద్రవ్యాలు, తమలపాకులు ఇచ్చి పంపాలన్నారు. ఈ సభలలో ప్రజల అవసరాల గురించి, వ్యవసాయ రంగంలో ప్రభుత్వ తోడ్పాటు తదితర అంశాల గురించి ప్రజలతో చర్చించాలని, ఈ మేరకు నివేదికలు తయారు చేసి తనకు పంపాలని టిపూ ఆదేశించారు.

టిపూ సుల్తాన్ ఆధునిక భావాలకు అనుగుణంగా ఆనాడే వ్యవహరించారనడానికి క్రమం తప్పకుండా ఆయన సాగించిన జనాభా లెక్కల సేకరణను ఉదాహరణగా తీసుకోవచ్చు. ఆయనకు ముందు ఎవ్వరూ ఆలోచించని జనాభా లెక్కల సేకరణను టిపూ జరిపించారు. పట్టణాలు, పల్లెలలో జనాభా లెక్కలతో పాటుగా ఆయా ప్రజలు కలిగియన్న ఆస్తిపాస్తులను కూడా నమోదు చేయించారు.

## రాజరిక వ్యవస్థలో ప్రజాస్వామ్య ప్రేమికుడు

ప్రజాస్వామిక వ్యవస్థ కానప్పటికి ప్రజలకు, ప్రజాభిప్రాయానికి టిపూ అధిక ప్రాధాన్యతనిచ్చారు. ప్రపంచంలోని పలు వ్యవస్థలను క్షణ్ణంగా పరిశీలిస్తున్న ఆయన ప్రజల మాటకు అత్యంత విలువనిచ్చారు. ఫ్రాన్సులో ప్రజాస్వామ్యం అస్పష్టంగా ఉన్న





దశలో మైసూరు రాజ్యంలోని ప్రజలందరికి సమానత్వం, సమానహక్కులను ప్రసాదించారు. ప్రజా ప్రభుత్వానికి ఆయన పునాదులు వేశారు. ప్రభుత్వంలో ప్రజలకు భాగస్వామ్యం కల్పించారు. ఈ మేరకు ప్రజల ప్రతినిధులతో కూడిన కమిటీలను నిర్మించారు. గ్రామాలలో, పట్టణాలలో ఈ కమిటీలలోని వ్యక్తుల అభిప్రాయాలను పరిగణలోకి తీసుకుని పాలనా పరమైన నిర్ణయాలు తీసుకున్నారు. ఈ వినూత్న విధానాలు అప్పటి ఆలోచనలకు-విధానాల స్థాయికి సరిపడలేదు.

ఆంగ్లేయ చరిత్ర కారుడు M.Wilkes తన History of Mysore గ్రంథంలో టిపూ ప్రజాస్వామిక దృక్పధం-ఆచరణ గురించి ఈ క్రింది విధంగా అభివర్ణించాడు.

‘Democracy which was in vogue in France at that time was not alien to Tipu. He had granted equality and equity to all. Tipu sultan laid the foundation of public Government in his reign. He made his subjects participate in administration by constituting a representative committee of the people. But the frame of mind and nature at that time could not accept this development.’ ( Tipu Sultan : Champion of Justice and Tolerance by G.Hasnan Kaif Publihed in Radiance Views Weekly 1-7 Aug. 1999, Page. 24)

చరిత్రను లోతుగా అధ్యయనం చేసిన టిపూ, ప్రజల స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకు అత్యధిక ప్రాధాన్యత నిచ్చారు. బ్రిటీషర్ల బానిసత్వం నుండి 1783లో అమెరికా బయట పడినప్పుడు 108 ఫిరంగులను పేల్చి సంతోషం వ్యక్తం చేసారు. స్వేచ్ఛను కాంక్షిస్తున్న ప్రభువుగా, ప్రజలను బానిసల్లా భావించరాదన్న విధానాన్ని టిపూ అనుసరించారు. రాజ్య వ్యవస్థకు, నైతికతకు, ప్రజలకు నష్టం-కష్టం కల్గించనంత వరకు ఎవరి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను హరించరాదన్నది ఆయన అభిమతం.

ప్రభువులు ప్రజలను తమ బానిసలుగానో, సేవకులుగానో భావించటం, వంగి వంగి అభివాదాలు చేయటం ఏమాత్రం తగదని టిపూ తన అధికారులను హెచ్చరించారు. అధికారులు, ప్రజలు దర్బారుకు వచ్చినప్పుడు వంగి వంగి సలాములు చెప్పే పద్ధతిని ఆయన కూడదన్నారు. ప్రభువు కాళ్ళ వద్ద నిల్చోవడం, చేయి పట్టుకుని ముద్దుపెట్టుకోవటం లాంటి పద్ధతులు వలదన్నారు.

ఈ తీరు అహంకారానికి ప్రతీకగా భావించిన టిపూ **అస్సలాము అలైకుం** అంటూ సాదాసీదాగా పలకరిస్తే చాలంటూ ఫర్మానా జారీ చేశారు. మసీదుకు కాని, మరో బహిరంగ ప్రదేశాలకు గాని ప్రభువు వెళ్ళునప్పుడు ఆయన రాకపోకల కోసం మార్గాన్ని నిరాటంకం చేసి ప్రజలను ఇబ్బంది పెట్టటం సరికాదన్నారు. ప్రజలను అవస్థల

పాలు చేయకుండేందుకు అవసరమగు నిర్మాణాలను, ఏర్పాట్లను ఆయన ప్రత్యేక శ్రద్ధతో చేయించారు.

టిపూ స్వయంగా **జాకోబియన్ క్లబ్** అను సంస్థను ప్రారంభించి, ఆ సంస్థ ప్రారంభోత్సవం సందర్భంగా ఒక మొక్క నాటారు. ఆ మొక్కకు **స్వేచ్ఛావృక్షం** (Tree of Liberty) అని నామకరణం చేయటమే కాకుండా తనను తాను **మైసూరు రాజ్య పౌరుడు** గా (TIPU CITIZEN OF MYSORE) పిలుచుకున్నారు. ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజలకు ప్రాధాన్యత ఇచ్చినట్టు ఆయన కూడా ప్రజలకు, ప్రజాభిప్రాయానికి, ప్రజల సంక్షేమానికి పెద్ద పీట వేశారు. ఒక రాజరిక వ్యవస్థకు చెందిన పాలకుడు ఈ విధంగా ప్రజాస్వామ్య భావాన్ని ప్రకటించటం అరుదైన విషయం. ఈ ప్రకటన టిపూలోని ఆధునిక ప్రజాస్వామ్య భావన ఎంత బలంగా ఉండేదో వెల్లడి చేస్తుంది. టిపూ కేవలం ప్రజాస్వామిక భావనలతో సరిపెట్టుకోవటమే కాకుండా ఆ భావనలను, ఆనాటి వాతావరణంలో, అందుకు తగ్గట్టుగా ఆచరణలో పెట్టి అద్వితీయుడన్పించారు.

## రాళ్ళెత్తిన కూలీలదే చరిత్ర

ప్రజల శ్రమకు తగిన ప్రతిఫలం సక్రమంగా అందజేయాలని ఆదేశాలు జారీ చేసారు. టిపూకు అత్యంత ప్రీతిపాత్రమైన, ప్రఖ్యాత వేసవి విడిది గృహం **దర్యా దౌలత్** నిర్మాణ సమయంలో ప్రజలచేత శ్రమదానం చేయించుకోవాలని అధికారులు సలహా ఇచ్చారు. ఈ సలహా పట్ల తీవ్రంగా స్పందిస్తూ, **ఫారో ప్రభువులు తమ వద్దనున్న బానిసల చేత పిరమిడ్స్‌ను నిర్మించారు....స్త్రీల, పురుషుల మీద కురిసిన కొరడా దెబ్బలతో**


దర్యా దౌలత్





**చైనా గోడ ఆద్యంతమూ రక్తంతో తడిసిపోయింది... మానవుల కన్నీళ్ళు, రక్తంతో మన ప్రాసాదాలు, రోడ్లు, డ్యామ్‌ల పునాదులు వేసినట్టయితే అటువంటి నిర్మాణాలు ప్రభువులకు ఎటువంటి కీర్తి ప్రతిష్టలను తెచ్చిపెట్టవు,** అని టిపూ వ్యాఖ్యానించారు.

('....The Pharaohs built the pyramids with the labour of their slaves...The entire route of the Great wall of Chaina is littered with the blood and bones of men and women forced to work under the whip and lash of slaves-driver ..so...there can no glory or achievement if the foundations of our places, roads, dams are mingled with tears and blood of humanity..' - ARUNGZEB AND TIPU SULTAN, Evaluation of their Religious Polices, by Dr.B.N.Pande, IOS, New Delhi, 1996, Page. 21)

ఈ మేరకు నిర్మాణాల విషయంలో చాలా అధునికమైన అభిప్రాయాన్ని ఆయన వ్యక్తం చేశారు. **తూర్పు నుండి పశ్చిమం వరకు ఉన్న ఏ దేశంలోనైనా నిర్మాణమై యున్న అత్యంత గొప్ప కళాత్మక కట్టడాల గురించి పరిశీలిస్తున్నప్పుడు, ఆ నిర్మాణాలకు ఆదేశం ఇచ్చిన ప్రభువులను కాదు మనం గుర్తుకు తెచ్చుకోవాల్సింది, ఆ నిర్మాణాలకు రూపు కల్పించిన ప్రజల శ్రమను, ఆ ప్రజలు పడిన పాట్లను, ఈ నిర్మాణాల సమయంలో మృత్యువాత పడిన శ్రామికుల త్యాగాలను మనం గుర్తుకు తెచ్చుకోవాలి'** అని పేర్కొంటూ **రాళ్ళెత్తిన కూలీలకు** ఆయన తన మనస్సులో పెద్ద పీట వేశారు.

( '....To my mind every great work of art and architecture be in countries to the west or to the east of India, is a monument not so much to the memory of those who ordered them to be built but to the agony and toil, blood and tears of those unfortunates who were driven out to death in the efforts to built it...' - AURUNGZEB AND TIPU SULTAN, Evolution of their Religious Polices, by Dr.B.N.Pande, Page. 21)

ఈ మేరకు **కూలివాని చెమట అతని శరీరం నుండి ఎండిపోక ముందే అతని కూలిని చెల్లించాల్సింది** గా ఆదేశించిన మహమ్మద్ ప్రవక్త ప్రవచనం ప్రకారంగా దర్యా దౌలత్ నిర్మాణంలో పాల్గొన్న శ్రమజీవులకు ఆయన ప్రతిఫలం చెల్లింపచేశారు.

## ప్రజా సంక్షేమం పట్ల ప్రత్యేక శ్రద్ధ

ప్రజల సంక్షేమం, భద్రత పట్ల ఆయన చాలా శ్రద్ధ వహించారు. ప్రజలకు నష్టం కలిగించే శక్తుల పట్ల చాలా కఠినంగా వ్యవహరించారు. సహజంగా ప్రభువులకు ప్రభువులు శత్రువులవుతారు. టిపూ ఈ విషయంలో భిన్నత్వం ప్రదర్శించారు. ఆయన తన వ్యక్తిగత శత్రువుల కంటే తన ప్రజలకు ఇబ్బందులు కలగచేస్తూ శత్రువులుగా

ప్రవర్తించిన వారి పట్ల నిర్ధాక్షిణ్యంగా వ్యవహరించారు. సరిహద్దు ప్రాంతాలలో గల తన ప్రజలను ఇబ్బందుల పాల్జేసిన శక్తులను తన శతృవులుగా ప్రకటించారు, ఈ మేరకు చర్యలు తీసుకున్నారు. ప్రజలకు ఎవరు శత్రువులో వారు తనకూ శత్రువులని అన్నారు. ఈ మేరకు టిపూ ప్రకటించిన అధికారిక ప్రవర్తన నియామావళి ఆయన ఉన్నత ఉద్దేశాలను వివరిస్తుంది. **నా ప్రజలతో ఎవరు కలహిస్తారో, వారు నాతో యుద్ధం ప్రకటించినట్టు,** అని టిపూ తన శత్రువులను, సంఘ వ్యతిరేక శక్తులను చాలా తీవ్రంగా హెచ్చరించారు.

(" To quarrel with our subjects is to go to war with ourselves. They are our shield and our buckler; and it is they who furnish us with all things. Reserve the hostile strength of our empire exclusively for its foreign enemies. - AURUNGZEB AND TIPU SULTAN, Evolution of their Religious Polices, BN Pandey, Page. 22)

సమాజంలోని బలహీన వర్గాల పట్ల అయన ప్రత్యేక శ్రద్దను కనపర్చారు. పిల్లలు, మహిళలు, వృద్ధుల సంక్షేమం కోసం నిర్దుష్ట చర్యలు తీసుకున్నారు. అనాథలు, ఆడపిల్లలను ఆలయాలలో దేవదాసీలుగా స్వీకరించటం, విదేశాలకు సేవకులుగా విక్రయించటం తగదన్నారు. ఆనాథలైన బాలికల క్రయవిక్రయాలు శిక్షారమైన తీవ్ర నేరాలుగా ప్రకటించారు. అనాథలు స్వయం పోషకులయ్యేందుకు తగిన శిక్షణ, ఆరువాత ఉపాధి అవకాశాలు కల్పించారు. శిక్షణ పూర్తయ్యేంత వరకు మాత్రం ప్రభుత్వం పోషణ బాధ్యతను స్వీకరిస్తుందని, ఈ మేరకు టిపూ చర్యలు చేపట్టారు.

వికలాంగులకు, అంధులకు ఆత్మస్థయిర్యం కలుగ చేసేందుకు పలురకాల సహాయక చర్యలు అమలుచేశారు. ఈ అభాగ్యులు తమ స్వంత కాళ్ళమీద తాము నిలబడేందుకు అవసరమగు అన్ని చర్యలను తీసుకోవాలని ఆయన అధికారులకు ఆజ్ఞలు జారీ చేయటం మాత్రమే కాకుండా, ఆయా బలహీన వర్గాలకు చెందిన పథకాల అమలును కూడా ఆయన స్వయంగా పర్యవేక్షించారు.

యుద్ధ రంగంలో చనిపోయిన సైనికుల కుటుంబాల పట్ల ఆయన శ్రద్ధ చూపారు. భర్తలను కోల్పోయిన భార్యలు, వారి పిల్లల పోషణ పట్ల ప్రత్యేక బాధ్యత వహించారు. యుద్ధం వలన వ్యక్తిగత జీవితాలకు జరిగిన నష్టాల భర్తీకి ఆయన చర్యలు తీసుకున్నారు. యుద్ధం కారణంగా అన్యాయంగా ఎవ్వరికీ ఎటువంటి నష్టం కలుగరాదని ఆయన ఆదేశాలు జారీ చేశారు.

రాజ్యసేవలో **ప్యూన్** స్థాయి చిన్న ఉద్యోగులు మరణిస్తే, ఆ ఉద్యోగి వారసునికి





ఆ ఉద్యోగం ఇవ్వాలని ఆదేశాలు జారీ చేశారు. ఆ ఉద్యోగికి వారసులు లేనట్టయితే ఆ కుటుంబానికి తగిన పొలం ఇవ్వాలని, ఆ కుటుంబంలో ఆ పొలం చేసుకునే వారు లేనట్టయితే, సదరు పొలాన్ని కౌలుకు చేయించుకుని అవసరాలు గడుపుకునే విధంగా ఏర్పాటు చేయమని ఆయన తన అధికారులకు స్పష్టంగా ఆదేశాలిచ్చారు.

మహిళలు, వృద్ధులు, పిల్లలు శతృవర్గానికి చెందిన వారైనప్పటికి టిపూ వారికి ఎటువంటి నష్టం కలిగించలేదు. పరాజిత రాజ్యాల ప్రజలను దోచుకోవటం హీనమైన చర్యగా ఆయన పేర్కొన్నారు. ఈ మేరకు సైనికాధికారులకు చాలా స్పష్టమైన ఆదేశాలు జారీ చేశారు. 1783, 1785, 1787 లో టిపూ జారీ చేసిన ఆజ్ఞలలో, **పరాజిత ప్రాంతాన్ని దోచుకోవడం ద్వారా విజేత సంపన్నం కావచ్చును కాని ఆ ఆచర్య సంపూర్ణ సైన్యాన్ని అగౌరవానికి గురిచేస్తుంది. యుద్ధం యుద్ధభూమికి మాత్రమే పరిమితం కావాలి. యుద్ధాన్ని ఆయాయక సామాన్య పౌరుల మీదకు తీసుకెళ్ళవద్దు. పరాజిత ప్రాంతాల మహిళలను ఆదరించండి. ఆయా మతాలను గౌరవించండి. వృద్ధులకు, పిల్లలకు రక్షణ కల్పించండి,** అని పేర్కొన్నారు.

(' Looting a conquered enemy enriches a few. But impoverishes that nation and dishonours the entire army. Wars must be confined to battlefields. Do not carry them to innocent civilians. Honour their women, respect their religion, and protect their children and infirm ..' - Aurangzeb and Tipu Sultan : B N Pandey, Page . 22)

పూర్వీకుల సాంప్రదాయలను గౌరవిస్తూనే అనేక ప్రజోపయోగకర సంస్కరణలకు టిపూ అంకురార్పణ చేశారు. సంస్కరణల అమలు విషయంలో వ్యక్తిగత కష్ట నష్టాలను ప్రజల వ్యతిరేకతను కూడా ఆయన ఖాతరు చేయలేదు. ఖురాన్ గ్రంథంలోని ప్రవచనాల ప్రకారంగా వ్యభిచారం, బానిసత్వం, బహు భర్తృత్వం, మధ్యపానాన్ని నిషేధించారు. మలబారు మహిళలు నడుం పైభాగాన ఎటువంటి ఆఛ్చాదన లేకుండా అర్ధనగ్నంగా తిరగటం గమనించి మహిళలంతా రవికలు ధరించాలని ఆజ్ఞలు జారీ చేశారు. ఈ ఆదేశాలను ధిక్కరించిన వారి పట్ల కఠినంగా వ్యవహరించారు. కాళిమాత పేరుతో సాగుతున్న నరబలిని నిషేధించారు. ఫకీర్లు – సన్యాసులు మాదక ద్రవ్యాలను తీసుకోవటం తీవ్రమైన నేరంగా పరిగణించారు. పొగాకు సేవనం ఆనారోగ్యకరమని నిషేధించారు. ప్రతి వ్యక్తి పొదుపును అలవర్చుకోవాలని. అనవసర దుబారాను తగ్గించాలని, వ్యక్తి తన సంపాదనలో ఒక శాతం కంటే ఎక్కువ మొత్తాన్ని విలాసాలకు ఖర్చు చేయరాదని ఖచ్చితమైన ఆజ్ఞలు జారీచేసారు.

# అంతర్జాతీయ వ్యవహారదక్షుడు

టిపూ 17 సంవత్సరాల పాటు సాగించిన పరిపాలనలో అత్యధిక సమయం తన రాజ్యాన్ని కబళించాలనుకుంటున్న బ్రిటీషర్లను, నిజాం నవాబు, మరాఠాలను ఎదుర్కొంటూ గడిపినప్పటికీ, స్వదేశీ వ్యవహారాలను చక్కదిద్దుకుంటూనే, అంతర్జాతీయ వ్యవహారాలను కూడా దక్షతతో నిర్వహించి చరిత్రకారుల ప్రశంసలను అందుకున్నారు. మాతృభూమి నుండి ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులను తరిమి కొట్టేందుకు పొరుగున ఉన్న నిజాం నవాబు, మరాఠా నాయకులు ఏకమై ఐక్య సంఘటనగా ఏర్పడేందుకు తనతో కలసి రావాల్సిందిగా కోరారు. బలమైన శక్తిగా ఎదుగుతున్న మైసూరు రాజ్య ప్రాభవ వైభవాన్ని సహించలేని స్వదేశీపాలకులు, ఆయనకు తోడ్పాటు ఇవ్వకపోవటంతో విదేశీయుల వైపు దృష్టిసారించారు.

**శత్రువు శత్రువు, మిత్రుడు**, అనే రాజకీయ సూత్రీకరణను అనుసరిస్తూ, తొలుత ఫ్రెంచ్‌వారిని, ఆ తరువాత టర్కీ, అఫ్ఘనిస్తాన్ ఇరాన్, దేశాధినేతల స్నేహహస్తం కోరారు. టిపూ వ్యవహార దక్షత వలన ఈ దేశాధి నేతల నుండి అనుకూల స్పందన లభించింది. ఆనాడు అంతర్జాతీయ రంగాన బ్రిటీషర్ల ప్రభ బాగా వెలిగిపోతున్నందున, కీలకమైన చివరి దశలో టిపూకు సహాయం లభించలేదు. ఫ్రెంచి వారు చాలాకాలం టిపూతో స్నేహం నెరపినప్పటికీ, ఎడు సంవత్సరాల తరువాత ఫ్రాన్స్- ఇంగ్లాండ్ మధ్యన కుదిరిన శాంతి ఒప్పందాన్ని సాకుగా తీసుకుని ఫ్రెంచి సైన్యాధితులు ఆత్యంత కీలక సమయంలో టిపూకు సహాయం చేయ నిరాకరించారు.

బ్రిటీషర్లను తరిమి కొట్టాలన్న ఏకైక లక్ష్యంతో టిపూ నిరంతరం సాగించిన ప్రయత్నాల ఫలితంగా ఆయన సహాయానికి తరలి వస్తున్నట్టుగా ఒక దశలో నెపోలియన్ తెలిపారు. ఈ మేరకు టిపూకు నెపోలియన్ లేఖకూడా రాసాడు.

( "....You have been already informed of my arrival on borders of the sea, with an invincible army, full of the desire of delivering you from the iron yoke of England.." - TIPU SULTAN : HIS VISION AND MISSION, By Prof. B. Sheik Ali, Page. 14) అని టిపూకు రాసిన లేఖలో నెపోలియన్ పేర్కొన్నాడు.

మాతృభూమిని కబళించాలనుకుంటున్న బ్రిటీషర్లకు వ్యతిరేకంగా పోరాటం చేయడానికి ఇతర దేశాల స్నేహహస్తం కాంక్షించినట్టుగానే, దేశీయ వర్తక, వాణిజ్యాలు, ఎగుమతులు, దిగుమతులు, స్వదేశీ పరిశ్రమలు, ఆధునిక ఆయుధాల తయారికి





అవసరమగు సాంకేతిక పరిజ్ఞానాన్ని బయట నుండి సంపాదించేందుకు, మిత్ర రాజ్యాలతో వాణిజ్య సంబంధాలను పటిష్ట పర్చేందుకు, టిపూ ఎంతో బుద్ధి కుశలతతో వ్యవహరించి విజయం సాధించారు. కచ్, మస్కట్, పెరూ, ఒర్మాజ్, జిద్దా, బసరా, ఎడెన్ రాజ్యాలలో వర్తక-వాణిజ్య కేంద్రాలను ఏర్పాటు చేయటమేకాక, చైనా, ఫ్రాన్స్, టర్కీ, ఇరాన్ లాంటి దేశాలతో మంచి సంబంధాలు నెలకొల్పారు.

# 'స్వదేశీ' ఉద్యమకారుడు

టిపూ శతాబ్దం క్రితమే స్వదేశీ ఉద్యమానికి శ్రీకారం చుట్టారు. ఈ మేరకు జాతీయోద్యమంలో భాగంగా మన దేశంలో ప్రారంభమైన **స్వదేశీ ఉద్యమం** కంటె ముందుగా టిపూ ఆ ఆలోచనను తన గడ్డ మీదకు తీసుకవచ్చారని చెప్పవచ్చు.ఆయన విదేశీ వర్తకాన్ని ఏమేరకు ప్రోత్సహించినా బ్రిటీషర్ల వస్తువుల వాడకాన్ని మాత్రం అంగీకరించలేదు. వలస పాలకుల వస్తులన్నిటినీ టిపూ తన రాజ్యంలో నిషేధించారు. ప్రభుత్వం పరంగా ఇంగ్లాండు నుండి ఎటువంటి వస్తువును రానివ్వలేదు. ఇంగ్లాండు వర్తకుల నుండి ఎటువంటి వస్తువులను కొనరాదంటూ, ప్రభుత్వ వ్యాపార ప్రతినిధులకు ప్రత్యేక ఆదేశాలను జారీచేశారు.

ఆ కారణంగా ఇంగ్లాండు దిగుమతులను కాదన్నారు. టిపూ తన వ్యక్తిగత వస్తువులలో ఇంగ్లాండు వస్తువులను నిషేధించారు. ఈ విషయమై ఆయన తన వారికి నిర్ధుష్టమైన ఆదేశాలిచ్చారు. ఆయన భారతీయ దుస్తులను మాత్రమే ధరించారు. మద్రాసు నుండి కంపెనీ వ్యాపారులు విక్రయిస్తున్న ఉప్పును కొనుగోలు చేయవద్దని ప్రత్యేక ఆజ్ఞలు జారీచేశారు. ఇంగ్లాండు వర్తకుల మీద ఆయన ఆంక్షలు విధించారు. సామాన్య ప్రజల వలె వారు వ్యవహరించ వీలు లేకుండా చేశారు. పరిమితులు విధించారు. అవసరమైతే వారి ఆస్థిపాస్తులను జప్తు చేయడానికి కూడా ఆయన సిద్ధపడ్డారు.

ఈస్ట్ ఇండియా కంపెనీ వ్యాపారం ద్వారా మన దేశంలో ప్రవేశించి, స్వదేశీ రాజ్యాలను దిగమింగుతూ క్రమంగా విస్తరిస్తున్న వైనం వలన రానున్న ప్రమాదాన్ని పసిగట్టిన టిపూ ఈ వ్యాపారుల మీద ప్రత్యేక ఆంక్షలను విధించారు. బ్రిటీష్ వర్తకుల సరుకులను కొనుగోలు చేయకుంటే, గత్యంతరంలేని పరిస్థితులలో కంపెనీ పాలకులు ఈ దేశం వదలి వెడతారంటూ ఆయన భావించారు.

ఈ విషయాన్ని ముఫ్తి షంషుద్దీన్ అహమ్మద్ రేడియన్స్ వారపత్రికలో ( 1-7 ఆగస్టు,1999) రాసిన ఆంగ్ల వ్యాసంలో ఈ క్రింది విధంగా పేర్కొన్నారు.

' He was the first Indian leader (Years before Gandhiji) who believed in non-cooperation with foreigners. He wrote to his officers in Calcutta not to purchase goods from English traders, thus they would automatically be compelled to leave the country.'

## సాహిత్యాభిలాషి

తండ్రి హైదర్ అలీ శ్రద్ధవలన టిపూ విద్యాధికుడు కావటమే కాకుండా, సాహిత్యాభిలాషిగా కూడా పేర్గాంచారు. పండితులను గౌరవించటం, సాహిత్య సభలను నిర్వహించటం, గ్రంథాలను రాయించటం పట్ల టిపూ ఎంతో ఆసక్తి చూపారు. కవి, పండితులకు ఆర్థిక వెసుబాటు కల్పించారు. ప్రత్యేకాంశాలలో పేరొందిన పండిత ప్రముఖులను ఆహ్వానించి 45 ఉపయుక్త గ్రంథాలను రాయించారు. టిపూ స్వయంగా రచయిత. ఆయన కూడా ఉర్దూ భాషలో గ్రంథాలు రాశారు.

1793లో ' Fauji Akhbar ' అను ఉర్దూ వారపత్రికను ఆయన ప్రారంభించారు. ఈ పత్రిక ప్రచురణ నిమిత్తం ఆయన అరబిక్ టైపుతో ప్రింటింగ్ ప్రెస్‌ను కూడా ఏర్పాటు చేయించారు. ఆనాడు ఫారశీ దర్బారు భాష ఆయనప్పటికి సామాన్య ప్రజల భాషగా ప్రాచుర్యం పొందిన ఉర్దూ భాషలో ఆయన పత్రికను తీసుకరావటం విశేషం. **ఫౌజీ అక్బార్**ను ఆయన జీవిత చరమాంకం వరకు నడిపారు. ఈ పత్రిక టిపూ సైన్యానికి



టిపూ స్వదస్తూరి





సంబంధించిన సమాచారం మాత్రమే అందించేది కావటంతో సామాన్య ప్రజల వరకు అది చేరలేదు.

టిపూకు అరబ్బి, పర్షియన్, కన్నడ, ఉర్దూ, ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలు బాగా తెలుసు. ఆయనకు హస్తసాముద్రికం, జ్యోతిశ్శాస్త్రంలో మంచి ప్రవేశం ఉంది. నిరంతరం యుద్ధాలలో మునిగితేలుతున్న సుశిక్షుతుడైన పోరాటయోధుడు అయినప్పటికి ఆయన సంగీతంలో కూడా మంచి ప్రతిభ చూపారు. ఆయన స్వయంగా పలు పాటలు రాసి వాటికి బాణీలు కూడా కట్టారని, అటువంటి ఓ పాటను యుద్ధ సమయాలలో సైనికులను ఉత్తేజితులను చేసేందుకు ఆ పాటను **మార్చింగ్ సాంగ్** గా వాడేవారని, ప్రముఖ రచయిత మొహమ్మద్ షౌకత్ మీర్జా తన గ్రంథం ' బసేరా ' లో ఉటంకించారు. ఆయన స్వయంగా ఆలిమ్, ఫాజిల్ మాత్రమే కాకుండా ఖురాన్ గ్రంథాన్ని చాలా క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. నిత్య జీవితంలోని సమస్యలకు ఖురాన్ గ్రంథం నుండి ప్రవచనాలను అతి సునాయసంగా ఉల్లేఖిస్తూ, పరిష్కార మార్గాలు సూచించే వారు.

టిపూకు అక్షరం అంటే మహాప్రీతి. ఆయన వివాహ సమయంలో వివాహ కానుకగా ఏది కావాలో కోరుకోమని తండ్రి హైదర్ అలీ అనగా, తనకొక **గ్రంథాలయం** కట్టివ్వమని తండ్రిని కోరారు. ఆ కోరికతో మహానందపడిన హైదర్ అలీ గ్రంథాలయాన్ని నిర్మించి ఇవ్వటమే కాకుండా, దేశ విదేశాల నుండి పలు భాషలలో గల అనేక గ్రంథాలను తెప్పించి టిపూకు కానుకగా ఇచ్చారు. టిపూ గ్రంథాలయం విలువైన 2 వేల పుస్తకాలతో నిండి ఉండేది. ఆయన గ్రంథాలయంలో మొగల్ చక్రవర్తి ఔరంగజేబు స్వదస్తూరితో రాసిన ఖురాన్ కూడా ఉంది. ఈ గ్రంథాలను ఓ పద్ధతి ప్రకారం జాగ్రత్త పర్చేవారు. టిపూ ఓ గ్రంథం తీసుకుని దానిని చదవడం పూర్తి చేశాక, ఆ గ్రంథం మీద ప్రత్యేక ముద్రను వేయటం అధికారుల రివాజు. 1799లో శ్రీరంగ పట్నాన్ని దోచుకున్న బ్రిటీషర్ల కూటమి సాగించిన విధ్వంసానికి ఈ గ్రంథాలయం కూడా గురి కావటంతో అందులోని అపూర్వ గ్రంథాలు కనుమరుగైపోయాయి.

టిపూ నిరంతరం రాజకీయాలు, పోరాటాలు, యుద్ధాలలో మునిగి తేలుతూ కూడా ప్రతిరోజూ ఏదో ఒక పుస్తకాన్ని కొంతసేపన్నా చదవనిదే విశ్రమించేవారు కారు. ఈ రకంగా ఆయన దేశ విదేశాల నుండి గ్రంథాలను తెప్పించుకుని అధ్యయనం చేసినందున అధునిక భావనలను, సాంకేతిక విజ్ఞానాన్ని బాగా సంతరించుకున్నారు. ఈ పరిజ్ఞానాన్ని మైసూరు రాజ్య పటిష్టతకు, మైసూరు రాజ్య ప్రజల సంక్షేమానికి టిపూ వినియోగించారు.

# విశ్వవిద్యాలయం ఏర్పాటు సంకల్పం

ప్రజలను విద్యావంతుల్ని చేయటానికి టిపూ ప్రత్యేక చర్యలు తీసుకున్నారు. విద్యను నిర్బంధం చేసి, ఉచిత విద్యను ప్రవేశ పెట్టారు. పలు విద్యాలయాలను ఏర్పాటు చేయించారు. బాగా చదువుకునే బిడ్డలకు ప్రోత్సాహకాలను ప్రకటించారు. చదువు పట్ల ప్రత్యేక దృష్టిగల ఆయన విజ్ఞానార్జనకు ప్రయత్నించే ప్రతివారిని చాలా గౌరవించారు. మైసూరు రాజ్య రాజధాని శ్రీరంగపట్నంలో విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయాలని టిపూ సంకల్పించారు. ఆ విశ్వవిద్యాలయానికి JAMIAL UMUR అని నామకరణం చేయాలని ఉవ్విళ్ళూరారు. ఆ విశ్వవిద్యాలయంలో భారతీయ విజ్ఞానంతో పాటుగా, పాశ్చాత్య విజ్ఞానాన్ని బోధించాలని, మానవీయ, సాంకేతిక విద్యాభ్యాసానికి అగ్రస్థానం కల్పించాలని ఆశించారు. ఆ మైసూరు సూర్యుడు ఆకస్మికంగా అస్తమించటంతో విశ్వవిద్యాలయం ఏర్పాటు కలగానే మిగిలి పోయింది.

ఆనాటి టిపూ కలను నిజం చేస్తూ, ఆయన ఆశించిన రీతిలో కాకపోయినా ఆయన గౌరవార్థం ఆయన జన్మస్థానంలో ఆయన పేరిట విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయాలని కర్నాటక రాష్ట్ర ప్రభుత్వం తగు చర్యలను తీసుకొంటుంది. ఈ విషయాన్ని ఆ రాష్ట్ర మైనారిటీ సంక్షేమ శాఖామాత్యులు అబ్దుల్ జబ్బార్ ఖాన్ 2006 జనవరిలో ప్రకటించారు. అలీఘర్‌లో ఏర్పాటు చేసిన విశ్వవిద్యాలయంలా టిపూ జన్మించిన దేవనహళ్ళి ప్రాంతంలో ఆయన గౌరవార్థం ప్రత్యేక విశ్వవిద్యాలయం ఏర్పాటుకు ప్రయత్నాలు సాగుతున్నాయని, ఈ మేరకు కేంద్రప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపామని మంత్రి తెలిపారు. (The Milli Gazette, 16-31 Jan. 2006, page. 20)

# మతాభిమాని తప్ప మత దురభిమాని కాదు

టిపూ సుల్తాన్ ఇస్లాం ధర్మానురక్తుడు. మంచి ముస్లిం. అనునిత్యం దైవనామ స్మరణతో, అయిదు పూట్ల నమాజులు అదా చేస్తూ, ఆయన రోజువారి జీవనం సాగింది. ఆయన స్వమతం పట్ల అభిమానం గల ప్రభువు తప్ప, మతదురభిమానికాదు. మతపక్షపాతి అంతకంటే కాదు. ఆయన ప్రజలు ఏ మతస్థులైనా ఏ విషయంలో కూడా ఆయన వివక్షత చూపలేదు. భూమి శిస్తు, వృత్తి-వ్యాపారాలపై పన్నులు, శాసనాలు రాజ్య ప్రజలందరికి సమానం. బంధు ప్రీతికి దూరంగా సమర్థతకు, విశ్వాసానికి ఆయన పట్టం కట్టారు.







శ్రీరంగపట్నంలోని టిపూ సుల్తాన్ నిర్మించిన మస్జిద్-ఎ-ఆలా

ఒకసారి టిపూ వద్దకు ఎవరో వచ్చి, బ్రాహ్మణులు నమ్మదగ్గవారు కారని ఆరోపించాడు. ఈ ఆరోపణ వింటూనే ఆగ్రహించిన టిపూ ప్రతిస్పందిస్తూ, తన తండ్రి హైదర్ అలీతోపాటు తాను కూడా ఎంతగానో గౌరవించే శ్రీ పూర్ణయ్య (బ్రాహ్మణులు) సేవలను ఆయన ఉటంకించారు. ఎవరి పాప పుణ్యాలు వారివి మాత్రమే, ఎవరు నేరం చేస్తే వారికి మాత్రమే శిక్ష అంటూ, ఖురాన్ గ్రంథంలోని ప్రవచనాలను ఉటంకించారు. ఈ రకమైన ఫిర్యాదులను భవిష్యత్తులో తన వద్దకు తీసుకొని రావద్దని, ఫిర్యాదులతో వచ్చిన పెద్ద మనుషులను ఆయన తీవ్రంగా హెచ్చరించారు.

టిపూ రాజ్యంలోని పలు ప్రముఖ పదవులలో ముస్లింలు మాత్రమే కాదు అత్యధిక పదవులలో ముస్లిమేతరులు ఉన్నారు. శ్రీ పూర్ణయ్య (ప్రధాన దివాన్), శ్రీకృష్ణారావు (ఆర్థిక శాఖ) శ్రీ శామయ్య (నిఘా విభాగం) శ్రీ అప్పాజీ, శ్రీనివాసరావు, శ్రీ మూల్‌చంద్, శ్రీ సుజన్‌రావ్(దౌత్య ప్రతినిధులు), శ్రీహరిసింగ్, శ్రీరామారావు, శ్రీ శ్రీపాల్ రావ్ (సైన్యం) తదితరులు ముఖ్యులు. టిపూ సైన్యంలోని పందొమ్మిది మంది సేనాధిపతులలో పది మంది, పదమూడు మంది మంత్రులలో ఏడుగురు హిందువులని శ్రీ బి.యన్. పాండే తన గ్రంథంలో వెల్లడించారు.

ఇస్లాం విగ్రహారాధనకు వ్యతిరేకం అయినా, ఆయన మాత్రం తన రాజ్యంలో విగ్రహారాధనను సహించటం మాత్రమే కాకుండా ముస్లిమేతరుల ఆలయాలను, చర్చీలను, ఆయా సాంఘిక జనసముదాయాల ప్రజలను ప్రోత్సహించారు. మైసూరు రాజ్యంలో గల పలు ఆలయాలకు ఆయన ప్రతి ఏటా గ్రాంటులను, ప్రత్యేక నిధులను సమర్పించారు.

పూర్వం మైసూరు రాజులు పాటించిన నియమాలను, ఒరవడిని ఆయన కొనసాగించారు. ఈ మేరకు ఆలయాలకు సంబంధించి 156 ఫర్మానాలు జారీచేశారు. ప్రముఖ శృంగేరి మఠం స్వామీజీతో పలు ధార్మిక, సామాజిక విషయాలను ప్రస్తావిస్తూ, కన్నడంలో టిపూ 30 లేఖలు వ్రాశారు. ప్రసిద్ధిచెందిన లక్ష్మీనాధస్వామి ఆలయం (కలాల), నారాయణస్వామి ఆలయం (మేల్కోట్), శ్రీ కంఠేశ్వర ఆలయం, నజుండేశ్వరి ఆలయం (నంజూగూడ్) తదితర ఆలయాలకు అవసరమగు వెండి, బంగారు పాత్రలు, ఆభరణాలు,



**ప్రతి రోజూ ప్రాతఃకాలాన టిపూ సందర్శించే శ్రీరంగనాథ ఆలయం**





ఖరీదైన దుస్తులను టిపూ అందచేశారు. తండ్రి హైదర్ అలీచేత శంఖుస్థాపన చేయబడిన కాంజీవరం గోపురాలయం నిర్మాణాన్ని ఎంతో శ్రద్ధతో టిపూ పూర్తి చేయించారు. ఈ ఆలయ నిర్మాణానికి 10 వేల నాణాలను విరాళంగా అందచేశారు. అనంతరం అక్కడ జరిగిన రథోత్సవంలో టిపూ స్వయంగా పాల్గొన్నారు.

ఆలయాల **అజమాయిషికి టిపూ ప్రత్యేకంగా ఒక శాఖ ఏర్పాటు చేశారు.** మఠాలకు సంబంధించిన ఆస్తుల మంచి చెడ్డలను ఆ శాఖాధికారులు పర్యవేక్షించేవారు. ఆలయాల పరిరక్షణకు కూడా పలు చర్యలు తీసుకున్నారు. ఆయన సైన్యం దిండిగల్ కోటమీద దాడి చేసినప్పుడు కోటలోని ఆలయానికి ఎటువంటి నష్టం వాటిల్లకుండా ఫిరంగిదళం దాడులు జరపాలని, తన సైనికులకు, సైనికాధికారులకు ప్రత్యేక ఆదేశాలు జారీ చేశారు.

టిపూ ప్రాసాదం సమీపాన ఒకవైపు మసీదు ఉంది. ఆ మసీదును ఆయన 1790 జూన్ మాసం 4 వ తేదిన కట్టించారు. ఆ ప్రాసాదానికి మరొకవైపున శ్రీరంగనాథ స్వామి ఆలయం ఉంది. ఈ ఆలయం చాలా పురాతనమైనది. ఆ పరిసరాలలో మరికొన్ని ఆలయాలున్నాయి. నమాజుకు రమ్మని మసీదు నుండి వినపడే పిలుపుకు ఆయన ఎంతటి ప్రాధాన్యం యిచ్చేవారో శ్రీరంగనాథస్వామి ఆలయం, ఇతర ఆలయాలనుండి వినవచ్చే జేగంటలకు టిపూ అంతే ప్రాముఖ్యత ఇచ్చారు. ప్రతిరోజు ఉదయం అల్పాహారం తీసుకునే ముందు శ్రీరంగనాథస్వామి ఆలయాన్ని సందర్శించడం ఆయన అలవాటని, ఈ విషయంలో ఆయన మైసూరు ప్రభువుల ఈ సంప్రదాయాన్ని అనుసరించారని ప్రముఖ చరిత్రకారుడు శ్రీ బి.ఎన్. పాండే తన Aurangzeb and Tipu Sultan-Evaluation of their Religious Policies గ్రంథంలో పేర్కొన్నారు.

(..." Tipu Sultan, as was customary with the rulers of Mysore, daily visited the temple of Lord Ranganatha located inside the fort of Srirangapatnam, before taking his break fast." - Page 19)

బలవంత మతాంతీకరణలకు ముస్లిం రాజులు పాల్పడ్డారంటూ టిపూ మీద కూడా ఆరోపణలు వచ్చాయి. ఈ ఆరోపణలు ఓ పథకం ప్రకారంగా టిపూ అంటే ముస్లిమేతరులలో విద్వేషం కలిగేందుకు ఆంగ్లేయ రచయితలు, ఆ తరువాతి కాలంలో కొందరు స్వదేశీ రచయితలు ప్రచారంలో పెట్టారు. ఈ వాదనలను పూర్వపక్షం చేస్తూ ప్రముఖ చరిత్రకారుడు ఆర్.సి.మజుందార్ తన An Advance History of India లో, '..he was not fierce bigot...Though a pious Muslim, he did not attempt any wholesale conversion of his Hindu subjects...' అని వ్యాఖ్యానించాడు.

# లౌకిక ప్రభువు

టిపూ లౌకిక ప్రభువు. ఆయన చిన్నతనంలో, తండ్రి హైదర్ అలీ వద్దకు ఓ ముస్లిం ముల్లా ప్రముఖుడొకరు ఫిర్యాదు తెచ్చాడు. ప్రభువుకు తన ఫిర్యాదును విన్పిస్తూ, ఒక ముస్లిం రాజ్యంలో ముస్లిం ముల్లాలకు న్యాయం జరగటం లేదని నిందించాడు. ఆ ఆరోపణ వింటూనే, '**ఈ రాజ్యం ముస్లింలదని ఎవరన్నారు**?' (Who told you that this was a Mussalman Government? ) అంటూ హైదర్ అలీ ఆగ్రహం వ్యక్తం చేశారు.

ఈ విధంగా మత మనోభావాలకు అతీతంగా రాజ్య నిర్వహణ సాగించిన తండ్రి బిడ్డడు కావడంతో టిపూ కూడా మతాతీతంగా వ్యవహరించారు. ప్రజల మత విశ్వాసాలలో కలుగజేసుకోవద్దని అధికారులకు కూడా స్పష్టమైన ఆదేశాలను జారీ చేశారు. బహుళ మతాలు, జాతుల ప్రజలు సహజీవనం సాగిస్తున్న రాజ్యంలో అన్ని మతాలకు చెందిన ప్రజల పట్ల సమభావన చూపడం టిపూ ప్రత్యేకత. అందువలన ప్రతి ఒక్కరి మత సాంప్రదాయాలను ఆయన గౌరవించారు. నైతిక విలువలకు భంగకరం కానంతవరకు ఎవరి మత ఆచార-సాంప్రదాయాలను ఆయన పట్టించుకోలేదు.

ఒకసారి టిపూ వద్దకు ఒక ఫౌజ్‌దారీ వచ్చాడు. ఆయన ఒక ధర్మ సందేశం గురించి వివరిస్తూ, ఒక ముస్లిమేతర యువకుడు ముస్లిం బాలికను వివాహం చేసుకున్నాడని, దీనివలన ఆ ప్రాంతంలో తీవ్ర ఉద్రిక్తత నెలకొన్నదని పేర్కొన్నాడు. ఈ వివాహం విషయమై మరింత వివరణ ఇస్తూ, ఈ వివాహం షరియత్ ప్రకారం చెల్లదు, అందువలన నిందితులను శిక్షించేందుకు ఎటువంటి చర్యలు తీసుకోవాలో తెలుపమంటూ టిపూను అభ్యర్థించాడు.

('..a Hindu had married a Muslim lady causing tension in the locality. As such the marriage was not permitted in the Shariat, what action should be taken to punish the culprits ' - AURUNGZEB AND TIPU SULTAN, Evaluation of their Religious Polices, by Dr.B.N.Pande, Page. 19)

ఈ సమస్య విషయమై టిపూ స్పందిస్తూ, ప్రజల వ్యక్తిగత, మత సంబంధమైన విషయాలలో ఎటువంటి జోక్యం చేసుకున్నా సహించేది లేదని, శాంతి భద్రతలను కాపాడటం, ప్రజల ఆస్తులను రక్షించడం అధికారుల పూర్తి బాధ్యతగా గుర్తించుకోవాలని హెచ్చరించారు. ప్రజలకు సరైన న్యాయం ప్రసాదించేందుకు, అన్ని మతాల





ఆచార-సంప్రదాయాలను గౌరవించి, విచారణ సమయంలో ఆయా అంశాలను పరిగణలోకి తీసుకునేందుకు, ప్రధాన న్యాయస్థానాలలో అన్ని మతాలకు చెందిన న్యాయాధికారులను నియమించారు. ప్రజల ఫిర్యాదులను, సమస్యలను వ్యక్తిగత చట్టాలను అనుసరించి విచారించమని, అధికారులను, న్యాయాధికారులను ఆదేశించారు.

ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులతో పోరాడుతున్నా క్రైస్తవ మతాచారుల పట్ల ఎంతో గౌరవం, ఆదరణ చూపారు. మసీదు-మందిరం-చర్చీల మధ్యన టిపూ ఎటువంటి తేడా చూపించలేదు. చర్చీల వివాదాల సందర్భంగా నిష్పాక్షికంగా వ్యవహరిం చటమే కాకుండా, ఆయా చర్చీల, ఆ చర్చీల నిర్వహకుల రక్షణకు పలు ఏర్పాట్లు చేశారు.

1791-92లో మైసూరు రాజ్య భాగమైన షిమోగా మీద దాడి జరిపిన మహారాష్ట్ర సర్దారు రఘునాధరావు పట్వర్ధన్, సమీపంలో ఉన్న శృంగేరి పీఠానికి చెందిన మఠం మీద కూడా దాడి చేశాడు. ఆ దాడిలో మఠాన్ని కొల్లగొట్టి, బ్రహ్మణులను చంపి, శారదాలయంలో ఉన్న నగానట్రాను, విలువైన వస్తువులను దోచుకున్నారు. ఆలయంలోని శారదామాత విగ్రహాన్ని కూడా పెకిలించి బయటకు విసిరివేశారు.

ఈ దాడిలో మరాఠా దండు సాగించిన క్రూరత్వాన్ని తట్టుకోలేక జగద్గురు సచ్చిదానంద భారతి మహాస్వామి మఠం వీడి మరోచోట తలదాచుకుని టిపూకు ఓ లేఖ ద్వారా దుస్సంఘటన వివరాలను తెలిపారు. టిపూ సుల్తాన్ సహాయాన్ని-సహకారాన్నీ ఆయన ఆ లేఖలనో అర్థించారు. ఆ లేఖకు తక్షణమే స్పందిస్తూ, జరిగిన సంఘటనకు తన బాధను వ్యక్తం చేస్తూ, పీఠాధిపతి లేఖకు సమాధానం రాస్తూ, '**అంతటి పవిత్ర స్థలం మీద అలాంటి అకృత్యానికి పాల్పడిన వాళ్ళు పాపఫలితాన్ని అనుభవించక తప్పదని** ' టిపూ ఆగ్రహం వ్యక్తం చేశారు.

టిపూ అంతటితో సరిపెట్టుకోలేదు. ఆలయ పునరుద్దరణ, సంప్రోక్షణ తదితర కార్యక్రమాలకు అవసరమగు సహాయ-సహకారాలు అందించాల్సిందిగా, బేదనూరులో గల తన సర్దారుకు ఆదేశాలు జారీచేశారు. శారదా దేవి విగ్రహా పునఃప్రతిష్ట జరిగాక జగద్గురు పంపిన శాలువా, ప్రసాదాన్ని ఆయన స్వయంగా స్వీకరించారు. అనంతరం అమ్మవారికి కానుకలు, ప్రత్యేక వస్త్రాలను పంపారు.

ఈ సందర్భంగా జగద్గురుకు రాసిన లేఖలో, '**మీరు జగద్గురువులు. మీరు ప్రపంచమంతా సుభిక్షంగా ఉండాలని ప్రజలంతా సుఖ:శాంతులతో గడపాలని కోరుకుంటూ సదా జపతపాలలో నిమగ్నమై యుంటారు. మా ప్రజలంతా సుభిక్షంగా**

**ఉండాలని భగవంతుడ్ని ప్రార్థించండి. మీలాంటి మహనీయులు ఎక్కడ నివసిస్తారో ఆ దేశంలో మంచి వర్షాలు కురుస్తాయి. మంచి పంటలు పండుతాయి.',** అని జగద్గురు పట్ల తనకున్న గౌరవాన్ని టిపూ వ్యక్తం చేశారు.

( ' You are the Jagdguru, Your are always performing penance in order that whole world may prosper, and the people may be happy. Please pray God for increase of our prosperity. In whatever country holy persons like yourself my reside that country will flourish with good shows and crops ' - The Tigers of Mysore by Proxy Fernandez, page. 212)

## ఉద్దేశ్యపూర్వక వక్రీకరణలు

టిపూ సుల్తాన్ మత సామరస్యాన్ని ఎంతగా పాటించినా, ఈ గడ్డను ఆక్రమించుకున్న బ్రిటీషర్లు, ముస్లిం వ్యతిరేకతను నింపుకున్న స్వదేశీ చరిత్రకారులు, టిపూను ముస్లిమేతర మతస్థుల పట్ల దారుణంగా వ్యవహరించిన మతోన్మాదిగా చిత్రించారు. ఆ మేరకు బహుళ ప్రచారం చేశారు. ఈ ప్రచారం చాలా కాలం వరకు సాగింది. ప్రజలు, ప్రముఖులు కూడా అసత్యాలను-అర్ధ సత్యాలను, వక్రీకరణలను సత్యాలుగా నమ్మటం జరిగింది. ఈ కారణంగా టిపూ గురించి పలు దుర్భావనలు కొంతకాలం చోటు చేసుకున్నాయి.

ఈ అసత్యాలు ఎంతో కాలం నిలబడలేదు. అనంతర కాలంలో సాగిన పలు పరిశోధనలు, పరిశోధకుల కృషి వాస్తవాలను నిగ్గుతేల్చింది. నిజాయితీ నిబద్ధతగల పరిశోధకులు, వాస్తవిక చరిత్రను ప్రజల ముందుకు తెచ్చారు. ఆ కృషి వలన అసత్య ప్రచారం, వక్రీరణల వెనుక గల వ్యక్తుల-వ్యవస్థల దురుద్దేశాలు బహిర్గతయ్యాయి.

టిపూ బలవంత మత మార్పిడికి పాల్పడినందున మతాంతీకరణ యిష్టంలేని మూడు వేలమంది బ్రాహ్మణులు ఆత్మహత్యలు చేసుకున్నారని, ఆ ఆత్మహత్యల దుస్సంఘటనలకు టిపూ కారణమని ప్రధానంగా ఆరోపణ వచ్చింది.

(Three Thousand Brahmins committed sucide as Tipu wanted to convert them forcibly into the fold of Islam. -Aurungzeb and Tipu Sultan : BN Pande, Page. 14)

ఈ ఆరోపణలను కలకత్తా విశ్వవిద్యాలయానికి చెందిన సంస్కృత విభాగం అధిపతి డా॥ హర ప్రసాద్ శాస్త్రి తాను రాసిన మెట్రిక్యులేషన్ స్థాయి చరిత్ర పాఠ్యపుస్తకంలో





పేర్కొన్నారు. ఈ పుస్తకం ఆనాటి బెంగాల్, అస్సాం, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలలోని ఉన్నత పాఠశాల విద్యార్థుల చరిత్ర పాఠ్య గ్రంథంగా చాలా కాలం చెలామణీ అయ్యింది.

ఈ విషయం చాలకాలం తర్వాత ప్రఖ్యాత చరిత్ర పరిశోధకుడు, ఆ తరువాతి కాలంలో పార్లమెంటు సభ్యులు, రాజస్థాన్ గవర్నర్‌గా పనిచేసిన డా॥ బి.యన్. పాండే దృష్టికి (1928-29) వచ్చింది. ఆయన Religious Policy of Tipu Sultan అను విషయం మీద ఆనాడు పరిశోధన చేస్తున్నారు. టిపూ లౌకిక ప్రభువుగా నిరూపించే పలు దృష్టాంతాలు, ఫర్మానాలు, మఠాలకు, మఠాధికారులకు, జగద్గురువులకు, పీఠాధిపతులకు రాసిన వందలాది లేఖలను అధ్యయనం చేసిన ఆయనకు ఈ విషయం ఆశ్చర్యకరం అన్పించింది. మఠాలు, మత విశ్వాసాలు, మతస్థుల పట్ల సమాన గౌరవాన్ని ప్రదర్శించిన టిపూ మీద వచ్చిన ఇటువంటి ఆరోపణలను శ్రీ పాండే నమ్మలేక పోయారు.

ఈ విషయం గురించి వాస్తవం తెలుసుకోవాలని ఆయనలో ఉత్సుకత కలిగింది. ఆ సమాచారానికి ఆధారాలేవో తెలుపమని, డా॥ హర ప్రసాద్ శాస్త్రికి పలు లేఖ రాసారు. శ్రీ శాస్త్రి నుండి ఎటువంటి సమాధానం రాలేదు. శ్రీ పాండే పట్టువదలని విక్రమార్కునిలా ఉత్తరాలు రాయసాగారు. చివరకు తన లేఖకు సమాధానం రాకున్నట్టయితే, డా॥ హర ప్రసాద్ శాస్త్రి ఆరోపణలు, ఆ తదుపరి చర్యలను మేధోపరమైన వంచనగా పరిగణించాల్సి వస్తుందని శ్రీ శాస్త్రిని ఆయన హెచ్చరించారు. ఆ హెచ్చరికతో, ఆ సంఘటన వివరాలు **మైసూరు గెజిట్** లో ఉన్నాయంటూ, ఒక్క చిన్నమాట రాసిన లేఖను పంపి డా॥ శాస్త్రి సరిపెట్టదలచుకున్నారు.

డాక్టర్ శాస్త్రి పంపిన ఆ వివరాల మేరకు, శ్రీ బి.యన్. పాండే మైసూరు గెజిట్‌లో ఈ సంఘటన కోసం అన్వేషించారు. ఈ విషయమై, మైసూరు చరిత్ర మీద నిష్ణాతులైన ప్రొఫెసర్ శ్రీకాంతయ్య, శ్రీ బ్రిజేంద్రనాథ్ సీల్‌లను ఆయన సంప్రదించారు. మైసూరు రాజ్య చరిత్ర మీద మంచి పరిజ్ఞానం కలిగిన ప్రముఖ చరిత్రకారుడు శ్రీ కాంతయ్య ఈ విషయమై శ్రీ పాండేకు లేఖ రాస్తూ, **మైసూరు రాజ్యచరిత్ర అధ్యయనశీలిగా మూడు వేల మంది బ్రాహ్మణుల ఆత్మహత్య సంఘటన తన దృష్టికి రాలేదని, అటువంటి సంఘటన మైసూరు గజిట్‌లో ఎక్కడా తాను చూడలేదని, అది ఎక్కడాలేదని తాను ఘంటా పథంగా చెప్పగలను,** అని రాశారు.

('. the episode of the suicide of 3000 Brahmins is nowhere in the Mysore gazette and as a student of history of Mysore was quite certain

that no such incident had taken place...' - Aurungzeb and Tipu Sultan : BN Pande, Page 14)

ప్రొఫెసర్ శ్రీకాంతయ్య అంతటితో ఊరుకోలేదు, డా॥ బియన్ పాండే ఆసక్తిని బట్టి టిపూ లౌకిక ప్రభువుగా రుజువు చేయు పలు పత్రాలను, ముఖ్యమైన డాక్యుమెంటుల కాపీలను ఆయనకు పంపారు. ఈ పత్రాలను పరిశీలించి టిపూ మీద దురుద్దేశ్య పూర్వకంగా సాగిన ఆరోపణల మీద శ్రీ శాస్త్రి పాత్ర గురించి డా॥ పాండే ఓ నిర్ధారణకు వచ్చారు. ఈ సంఘటనకు సంబంధించిన నిజానిజాలను తెలుపమంటూ, శ్రీ కాంతయ్య స్పందనను, ఇతర పత్రాలను మరోసారి శ్రీ శాస్త్రి దృష్టికి తెస్తూ, ఆయన పాఠ్యగ్రంథంలో ఉటంకించిన సంఘటనకు తగిన ఆధారాలు చూపాలని కోరుతూ ఉత్తరం రాశారు. ఈ మేరకు ఎన్ని ఉత్తరాలు రాసినా డా॥ శాస్త్రి నుండి ఎటువంటి ప్రత్యుత్తరం రాకపోవటంతో శ్రీ శాస్త్రి రాసిన మూడు వేల బ్రహ్మణుల ఆత్మహత్య సంఘటన వాస్తవం కాదని, అది డా॥ శాస్త్రి అభూతకల్పన అని శ్రీ పాండే భావించారు.

ఈ విషయం మీద మరింత పరిశోధన జరిపి, టిపూ మీద ఇటువంటి అసత్య ఆరోపణలను ఉద్దేశ్యపూర్వకంగానే కలకత్తా విశ్వవిద్యాలయం సంస్కృత విభాగం అధిపతి డా॥ హర ప్రసాద్ శాస్త్రి రాసారని శ్రీ పాండే నిర్ధారించుకున్నారు. అనంతరం ఈ పూర్తి వ్యవహారానికి సంబంధించిన పత్రాలను కలకత్తా విశ్వ విద్యాలయం వైస్‌ఛాన్సలర్‌కు శ్రీ పాండే పంపారు. టిపూ మీద డాక్టర్ శాస్త్రి ఉద్దేశ్యపూర్యకంగా చేసిన అసత్య ఆరోణలను, ఆయన దృష్టికి తీసుక వచ్చారు. ఆ పత్రాలను పరిశీలించిన విశ్వవిద్యాలయం అధికారుల సిఫారస్సు మేరకు శ్రీ శాస్త్రి గ్రంథాన్ని విశ్వవిద్యాలయం సూచించిన పాఠ్య గ్రంథాల జాబితా నుండి తొలగిస్తూ, కలకత్తా విశ్వ విద్యాలయం వైస్‌ఛాన్సలర్ నిర్ణయం తీసుకున్నారు. ఆ నిర్ణయం మేరకు శ్రీ శాస్త్రి పాఠ్య గ్రంథాన్ని తొలగించారు. ఈ తొలిగింపు జరిగే సరికే పలు సంవత్సరాలు గడిచిపోవటంతో టిపూ మీద చేసిన అభాండాలు, అసత్య ఆరోపణలు అక్షరసత్యాలుగా బహుళ ప్రచారం పొందాయి.

ఆ తరువాత కూర్గు, మలబారు హిందూ జనసమూహాల పట్ల చాలా దారుణంగా, అత్యంత క్రూరంగా టిపూ సుల్తాన్ వ్యవహరించారని ఆయనకు వ్యతిరేకంగా మరొక ఆరోపణ ప్రచారంలోకి వచ్చింది. ఈ ఆరోపణలలోని నిజానిజాల నిగ్గు తేల్చుతూ, టిపూ కఠినంగా వ్యవహరించింది వాస్తవమైనా, ఆ వ్యవహార సరళికి రాజకీయాలు మాత్రమే కారణమని, ఆయన కఠిన వైఖరికి ఆయన మతం, మత విశ్వాసాలు ఏమాత్రం కారణం కాదని శ్రీ బి.యన్. పాండే లాంటి పలువురు పరిశోధకులు తేల్చి చెప్పారు.





మతం పట్ల విశాల లౌకిక దృక్పథం గల టిపూ, రాజాజ్ఞలను ఉల్లంఘించిన వారు ఎంతటి వారైనా, వారే మతానికి చెందిన వారైనా కఠినంగా వ్యవహరించారు. స్త్రీలు రవికలను తప్పక ధరించాలని జారీ చేసిన ఆజ్ఞలను ఖాతరు చేయక పోవటమే కాక, బ్రిటీషర్లుతో చేతులు కలిపినందున, మంగళూరు క్రైస్తవులు ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులకు తొత్తులుగా మారి, మైసూరు రాజ్యానికి వ్యతిరేకంగా వ్యవహరించటం వల్ల టిపూ ఆగ్రహనికి గురయ్యారు. బహుభర్తృత్వాన్ని నిషేధిస్తూ, టిపూ జారీ చేసిన ఆజ్ఞలను కూర్గు ప్రజలు ఉల్లంఘిచారు. ఆచార సంప్రదాయాలలో సంస్కరణలకు సంబంధించి ఆయన జారీ చేసి ఆజ్ఞలను ఉల్లంఘిచటమే కాకుండా, ఏకంగా టిపూ రాజ్యాధికారానికి ఎసరు పెట్టేందుకు శత్రువుతో కుమ్మక్కయ్యారు.

ఆకారణంగా ఆగ్రహించిన టిపూ కూర్గులను శిక్షించటంలో ఏ మాత్రం జాలి చూపలేదు. ఈ చర్యలన్నీ రాజకీయ కారణాల వలన చోటు చేసుకున్నవి తప్ప, మత మనోభావాల నేపథ్యం ఏమాత్రం లేదని, ప్రముఖ చరిత్రకారులు D.L. Nigam (Tipu ki jeevan), Dr. Visweswaraish (Bondage and Freedom), Mr. Rambha Saym Sunder తదితరులు తగిన ఆధారాలతో వివరించారు.

**ఆ కాలపు పాలకుల పోకడలకు తగ్గట్టు శత్రువర్గాల పట్ల టిపూ ఎంత క్రౌర్యం చూపినా, మతం విషయంలో, ముఖ్యంగా హిందువుల విషయంలో టిపూ క్రూరుడు కాదు. కెనరాలో క్రైస్తవుల మీద, మలబారులో నాయర్ల మీద అతడు విరుచుకుపడింది తనకు ఎదురు తిరిగారన్న రాజకీయ కక్షతో మాత్రమే తప్ప మత ద్వేషంతో కాదు. నాయర్ల మీద అతడి ఆగ్రహంలోనూ వారి బహుభర్తృత్వం ఆచారం మీద, మహిళలు అనాచ్ఛాదితంగా తిరగడంపైనా వ్యతిరేకతే ఎక్కువగా కన్పిస్తుంది. మొత్తంగా హిందూ మతం మీద విద్వేషంతో కత్తి ఎత్తి, పరిపాలనలో ముస్లింల పట్ల పక్షపాతం చూపి హిందువులను దుర్విచక్షణకు గురిచేసి, అన్ని విధాలుగా అణగదొక్కి బలవంతపు మత మార్పిడులను సాగించాడన్న నేరాలను అతడికి ఆపాదించడం అన్యాయం.** (ఇదీ చరిత్ర, యం.వి.ఆర్.శాస్త్రి, దుర్గా పబ్లికేషన్స్, హైదరాబాద్ 2005, పేజి. 201)

టిపూ ఆజ్ఞలను ఉల్లంఘించిన ముస్లిం మోపిల్లాలను కూడా ఆయన కఠినంగా శిక్షించటమే కాక తిరుగుబాటును పూర్తిగా అణిచివేసారు. సావనూర్, కర్నూలు, కడప సంస్థానాలకు చెందిన నవాబులు టిపూకు వ్యతిరేకంగా కుట్రలు చేస్తున్నందున వారిని తన దారికి తీసుకువచ్చేందుకు చాలా నిర్దాక్షిణ్యంగా వ్యవహరించారు. ఈ విషయంలో టిపూ మాత్రమే కాదు ఏ పాలకుడైనా తాను శత్రువుగా భావించిన వారి పట్ల ఆనాడు క్రూరంగానే వ్యవహరించారు. అందుకు టిపూ అతీతుడేంకాదు.

ఆంగ్లేయ సైనికాధికారి Major Dirom ఈ విషయమై వ్యాఖ్యానిస్తూ '..his cruelities were in general inflicted only on those whom he considered as his enimies' అని అభిప్రాయపడ్డాడు. (Quoted by RC Majundar in his An Advanced History of India, Page 708)

టిపూ సుల్తాన్ ప్రదర్శించిన నిష్పక్షపాత, మత సామరస్య పూర్వక వైఖరి మూలంగా ఆయన పలువురి ప్రశంసలను అందుకున్నారు. ప్రజల మన్నన పొందారు. టిపూ మత సామరస్య వైఖరిని కొనియాడుతూ, 1930 జనవరి 23 నాటి, **యంగ్ ఇండియా** లో మహాత్మాగాంధీ ఈ విధంగా పేర్కొన్నారు. **'విదేశీ చరిత్రకారులు ఫతే ఆలి టిపూ సుల్తాన్‌ను మత పిచ్చికలవాడిగ చిత్రించారు. తన రాజ్యంలో గల హిందువులను బలవంతంగా మత మార్పిడికి ప్రయత్నించాడని ఆరోపించారు. అతను అలాంటి వ్యక్తి కాదు. ఆయన మీద సాగిన పలు అసత్య ఆరోపణలకు భిన్నంగా, హిందూ ప్రజానీకంతో టిపూకు చాలా మంచి సంబంధాలు ఉండేవి'** అని మహాత్మాగాంధీ పేర్కొన్నారు.

( "...Fathe Ali Tipu Sulthan of Mysore is represented by foreign historians as a fanatic, who opposed his Hindu subjects and converted them to Islam by force... But he was nothing of the kind. On other hand his relations with Hindu subjects were perfectly cordial.." Young India, Jan.23, 1930, Page. 31)

## న్యాయవ్యవస్థ పట్ల ప్రత్యేక దృష్టి

టిపూ న్యాయవ్యవస్థ పట్ల ప్రత్యేక దృష్టి కలిగి ఉన్నారు. సమాజంలోని కొందరు వ్యక్తులు సాగించే కిరాతక చర్యలకు ఆ వ్యక్తిని మాత్రమే బాధ్యుడ్ని చేయాలి కాని, నేరం చేసిన ఆ వ్యక్తికి చెందిన జనసముదాయానికి ఆ నేరాన్ని ఆపాదించడాన్ని నిందించటాన్ని టిపూ తీవ్రంగా పరిగణించారు. ఎవరు తప్పు చేస్తే వారిని మాత్రమే నిందించాలి, నేరం రుజువైతే తగిన విధంగా శిక్షించాలి తప్ప, ఆ వ్యక్తికి సంబంధించిన యావత్తు సమాజాన్ని తప్పు పట్టడం అహేతుకం అన్నారు.

నేరస్థులకు శిక్షలు విధించటంలో వినూత్న మార్పులను ఆయన అమలు చేశారు. శిక్ష అనేది సమాజానికి ఉపయుక్తంగా ఉండాలని ఆయన భావించారు. ఈ మేరకు పలు చర్యలను తీసుకున్నారు. చిన్న, చిన్న నేరాలకు పాల్పడిన, సామాన్యులకు రైతులకు జైలు శిక్షలు జరిమానాలు విధించటాన్ని మాన్పించారు. నిందితుడు తప్పు చేశాడని రుజువైనట్టయితే గతంలోలా జరిమానా విధించడాన్ని తొలగించారు. జరిమానా సొమ్ముకు





బదులుగా విధించిన జరిమానా సొమ్ము మొత్తాన్ని బట్టి, గ్రామ పొలిమేరల్లో మొక్కలను నాటాలని, ఆ మొక్కలకు సక్రమంగా నీళ్ళు పోస్తూ, బాగా పెరిగేంత వరకు సంరక్షణ బాధ్యతలను నేరస్థుడు నిర్వహించాలని 1792లో ఆయన శాసనం చేసారు.
ఈ బాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తున్నారో లేదో పర్యవేక్షించడానికి గ్రామాధికారులను నియమించారు. ఈ వినూత్న శాసనం, ఆ శాసనం అమలుకు ఆయన తీసుకున్న నిర్ధుష్ట చర్యల వలన ప్రజలు నష్టపోయేది ఏమీ లేక పోగా మైసూరు రాజ్యం హరిత వనంగా మారింది. ఈ వినూత్న శిక్షా విధానం వలన, మైసూరు రాజ్యంలో హరిత విప్లవం విలసిల్లిందని టిపూకు వ్యతిరేకంగా తృతీయ మైసూరు యుద్ధంలో పాల్గొన్న బ్రిటిష్ సైన్యాధికారి Edward Moore ప్రత్యేకంగా పేర్కొనటం గమనార్హం.

## రాకెట్టు టెక్నాలజీకి ఆద్యుడు

ప్రజా జీవితాలను ప్రభావితం చేయగల అన్ని వ్యవస్థల అభివృద్ధికి టిపూ అమిత శ్రద్ధచూపారు. ప్రపంచంలో ప్రతి పరిణామాన్ని ఆయన ఆకళింపు చేసుకుంటూ, ఆయా మార్పులు–చేర్పులను తన రాజ్యంలోని ప్రజల మేలు కోసం వర్తింపచేయ ప్రయత్నించారు. ఈ మేరకు భారత దేశంలో రాకెట్ టెక్నాలజీని అభివృద్ధి పర్చి ఉపయోగించిన ప్రభువుగా టిపూ ప్రత్యేకతను గడించారు. ఆంగ్లేయులతో సాగిన యుద్ధాలలో ఆయన యుద్ధ రాకెట్లను బాగా ఉపయోగించారు. ఈ యుద్ధ రాకెట్ల తయారికి స్వదేశీ పరిజ్ఞానానికి విదేశీ సాంకేతిక విలువలను జోడించి విన్నూత యుద్ధ రాకెట్లను ఆయన ఆవిష్కరింపచేశారు. ఈ కారణంగా ఆయన యుద్ధ రాకెట్ల ఆద్యుడుగా ఖ్యాతిగడించారు. (Tipu Sulthan was the pioneer of the missile Technology in India. - The Milli Gazette, 16-31, Jan. 2006 page. 9)

ఈ యుద్ధ రాకెట్టును **భారతీయ యుద్ధ రాకెట్టు** ( India's War Rocket) గా పరిగణించారు. ఈ రాకెట్టు 2.4 కిలోమీటర్ల దూరంలో గల లక్ష్యాన్ని ఛేదించగలిగేది. ఈ రాకెట్ల తయారి, వినియోగం కోసం ఆయన ప్రత్యేకంగా 1200 నుండి 5 వేల మంది గల రాకెట్టు దళం ఏర్పాటు చేశారు. ఈ విషయాలను Prof. R.Narasimha తన వ్యాసం Tipus Contribution to Rocket Technology లో వివరించారు. టిపూ ఆవిష్కరించిన ఈ యుద్ధ రాకెట్ల విషయాన్ని మన రాష్ట్రపతి అబుల్ కలాం కూడా ప్రస్తావిస్తూ, ప్రపంచంలోని ప్రపథమ యుద్ధ రాకెట్టును టిపూ ఎలా వాడగలిగారు ? (How

Tipu Sulthan have led to the worlds first war Rocket?) అంటూ ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశారు.

## బ్రిటిషర్లతో రాజీలేని పోరాటం

చిన్ననాటనే అసమాన ధైర్యసాహసాలతో, తండ్రికి తగిన తనయుడన్పించుకున్న టిపూ, చిన్న వయస్సులోనే పలు విజయాలను సాధించారు. మలబారు ఆక్రమణతో ప్రారంభమైన ఆ యుద్ధవీరుని విజయపరంపర అటు ఈస్ట్ ఇండియా కంపెనీతో ఇటు స్వదేశీపాలకులైన నిజాం, మరాఠాలతో పోరుచేస్తూ ముందుకు సాగింది. చివరి శ్వాస వరకు ఈస్ట్ ఇండియా పాలకులను మాతృదేశం నుండి తరిమి వేయటానికి అవిశ్రాంతంగా పోరాడిన ఏకైక స్వదేశీ పాలకుడిగా టిపూ సుల్తాన్ చిరస్మరణీయమైన ఖ్యాతిగాంచారు. తండ్రి నుండి రాజ్యాధికారం పొందిన తరువాత టిపూ తన రాజ్యాన్ని ఉత్తరాన కృష్ణానది నుంచి, దక్షిణాన దిండిగల్ వరకు అంటే సుమారు 400 మైళ్ళు పొడవున, పశ్చిమాన మలబారు నుంచి, తూర్పున తూర్పు కనుమల వరకు సుమారు 300 మైళ్ళు విస్తరించగలిగారు.

బలపడుతున్న మైసూరు రాజ్యాధినేత టిపూ వైభవప్రాభవాలను చూసి అసూయా ద్వేషాలతో రగిలి పోతున్న నిజాం నవాబు, మరాఠాలు ఏకం కావటమే కాక టిపూకు



యుద్ధరంగాన టిపూ సైన్యాలు





వ్యతిరేకంగా ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులతో చేతులు కలిపారు. టిపూను ఎలాగైనా తుదముట్టించాలని కుట్రలు పన్నారు. మైసూరు రాణి శ్రీమతి లక్ష్మమ్మ మరోవైపు కంపెనీ పాలకులతో చేతులు కలిపి, టిపూను ఎలాగైనా పరాజయం పాల్జేసి మైసూరు రాజ్యాన్ని దక్కించుకోవాలన్న లక్ష్యంతో ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులకు ఆర్థికంగా సహాయం అందజేస్తూ, టిపూను దెబ్బ తీయడానికి తగిన సమయం కోసం ఎదురు చూడసాగింది. ఈ ప్రతికూల వాతావరణంలో మైసూరు రాజ్యాన్ని కాపాడుకోవటమే కాకుండా, బ్రిటీషర్ల రాజ్యవిస్తరణ కాంక్షకు స్వదేశీ సంస్థానాలు బలి కాకుండా ఉండేదుకు టిపూ శత విధాల ప్రయత్నించారు.

ప్రజలకు, స్వేచ్ఛకు నిజమైన శత్రువులు ఆంగ్లేయులన్న వాస్తవాన్ని గ్రహించిన ఏకైక స్వదేశీ పాలకుడు టిపూ. ఆ వాస్తవాన్ని ముందుగా గ్రహించారు కనుకు ఆతరువాత బ్రిటీషర్లతో పోరాడిన స్వాతంత్ర్య సమరయోధులకు ఆయన మార్గదర్శి అయ్యారు. (He was the only ruler who felt that the English are real enemies of people and freedom. He guided freedom fighters. - K.C. Menon, The Hindustan Times 16-11-1985)

బ్రిటీషర్ల పట్ల అంతటి శత్రుత్వం వహించారు కాబట్టే, ఆయనంటే ఆంగ్లేయ చరిత్రకారులకు టిపూ అంటే ఆగ్రహం. కంపెనీ పాలకులు మాత్రమే కాకుండా ఇంగ్లాండు లోని సామాన్య ప్రజలు టిపూ పేరు వినడానికి కూడా ఇష్టపడేవారు కారు. ఆ కాలంలో ఆంగ్లేయ మహిళలు ఏడుస్తున్న తమ బిడ్డలను సముదాయించడానికి **టిప్పు వచ్చి పట్టుకుపోతాడు** అని భయపెట్టే వారని ప్రతీది.

## స్వదేశీ ఉమ్మడి కూటమికి చివరికంటా ప్రయత్నం

బ్రిటీషర్ల నుండి స్వదేశీ పాలకులకు పొంచియున్న పెను ప్రమాదాన్ని గ్రహించిన పాలకుడిగా, ఆయన ఎంతగా ఆంగ్లేయులను వ్యతిరేకించాడో, అంతగా స్వదేశీయుల ఉమ్మడి ప్రయోజనాల కోసం, స్వదేశీ పాలకుల సమాఖ్యను ఏర్పాటు చేసేందుకు ప్రయత్నించారు. ఆయన ఏనాడూ బ్రిటీషర్లుతో చేతులు కలిపి స్వదేశీ పాలకులకు వ్యతిరేకంగా వ్యవహరించలేదు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా స్వదేశీ పాలకులకు నచ్చచెప్పేందుకు ఎన్నోసార్లు ప్రయత్నించారు. కుట్రలతో, కుయుక్తులతో అటు నిజాం, ఇటు మరాఠాలు టిపూ మీద కత్తులు దూస్తున్నా, ఆయన మాత్రం ఆ స్వదేశీ పాలకుల స్నేహాన్ని కాంక్షించారు. స్వదేశీ పాలకులతో కలిసి విదేశీ శత్రువు మీద రణభేరిని

మ్రోగించటానికి వ్యూహ రచన చేశారు. ఈ మేరకు స్వదేశీ పాలకులతో సంబంధాలను పటిష్టం చేసుకునేందుకు అటు నైజాం పాలకులతో, ఇటు మరాఠాలతో పలు మార్లు సంప్రదింపులు జరిపారు. నిజాం కుటుంబంతో వివాహ సంబంధాల ఏర్పాటుకు కూడా ఆయన ప్రతిపాదనలు పంపారు. తమ స్వంత ప్రయోజనాలు తప్ప, నిస్వార్థదృష్టిలేని స్వదేశీ పాలకులు టిపూ ప్రతిపాదనలను త్రోసిపుచ్చారు.

ఆరోజు టిపూ ప్రతిపాదనలను విని స్వదేశీపాలకుల సమాఖ్య ఏర్పాటుకు అంగీకరించి ఉంటే భారత దేశ చరిత్ర మరొరకంగా ఉండేది. ఈ విషయాన్ని టిపూను పరాజితుడ్ని చేసిన గవర్నర్ జనరల్ వెల్లస్లీ స్వయంగా ప్రకటించటం విశేషం. **ఆనాడు టిపూ మాటను స్వార్థపరులైన స్వదేశీ పాలకులు వినలేదు కాని, విని ఉన్నట్టయితే ఈ గడ్డమీద మాకు** (బ్రిటీషర్లకు) **నిలువ నీడ కూడా ఉండేది కాదు** , అని అన్నాడు. ఈ వ్యతిరేక పరిస్థితులను టిపూ చాలా చాకచక్యంగా ఎదుర్కొన్నారు. బహిర్గత-అంతర్గత శతృవులను దారుణంగా దెబ్బతీసి ఆధిక్యతను నిలుపుకున్నారు.

టిపూ అధికారం చేపట్టగానే సైనిక వ్యవస్థను ఆధునీకరించారు. ఆధునిక ఆయుధాలను, ఆ ఆయుధాలను ఉపయోగించే పద్ధతులను, ఆందుకు అనుగుణంగా సైనిక వ్యూహాలలో మార్పులను ప్రవేశ పెట్టారు. మైసూరు రాజ్యలక్ష్మి చుట్టూత కాచుక్కూర్చుని ఉన్న శతృవుల మూలంగా ఏర్పడిన ప్రత్యేక పరిస్థితుల వలన, ఆకస్మికంగా శతృవులు దాడి చేస్తే వారికి సరైన రీతిలో బుద్ధి చెప్పేందుకు, ఏ క్షణాన్నైనా శతృవు మీద రణభేరి మ్రోగించేందుకు సైన్యాన్ని సర్వసిద్ధంగా ఉంచారు. ఈ మేరకు సైన్యాలను ఆయన ప్రత్యేక పర్యవేక్షణలో తీర్చి దిద్దారు. విదేశీ విజ్ఞానాన్ని సమకూర్చుకుని, ఆ విజ్ఞానానికి స్వదేశీ జ్ఞానాన్ని జోడించి ఆయుధాలను తయారు చేయించారు. ఆ ఆయుధాల ఉపయోగించటంలో సైనికులకు ప్రత్యేక శిక్షణ ఇప్పించారు.

టిపూ సైనిక పాటవాన్ని గమనించిన William Mc Taud **టిపూ ఒక్కడే ఆనాడు సైన్యాన్ని చక్కని పథకం ప్రకారంగా శిక్షణ ఇచ్చి తీర్చిదిద్దిన పాలకుడని** (Tipu was the only ruler who trained his army in a well planned manner). కొనియాడాడు. ఈ తరహాలోనే బ్రిటీష్ సైన్యాధికారి Compbell వ్యాఖ్యానిస్తూ **ఆసియా లోని మిగిలిన రాజ్యాలలోని సైనిక వ్యవస్థల కంటె టిపూ సైనిక వ్యవస్థ చాలా ఉన్నత మైనదని** (Tipus milatary organisation was better than those of all other regimes in Asia) అన్నాడు. టిపూతో స్వయంగా పోరాడిన Lord Cornwallias మాట్లాడుతూ, **టిపూ సైన్యం ప్రపంచంలోని అత్యుత్తమ సైన్యాలలో ఒకటని** (Tipu's





army was one of the best in the world) ప్రశంసించాడు. ఆఘమేఘాల మీద తరలి వచ్చే టిపూ అశ్వికదళం శక్తి సామర్థ్యాలు ఆంగ్లేయులను ఆశ్చర్యచకితుల్ని చేశాయి. శతృ సైన్యాల మీద మెరుపుదాడులు సాగించే అశ్వికుల ప్రావీణ్యాన్ని బహువిధాల ప్రశంసించారు. ఈ విషయమై ఆంగ్లేయాధికారి Alexander Dow ప్రస్తావిస్తూ, **టిపూ సుల్తాన్ అశ్విక దళాలు కోట గోడలను కూడా అత్యంత సునాయాసంగా దాటటం చూస్తుంటే ఆయన అశ్వాలు రెక్కలు కలిగియున్నాయన్న భయం కలుగుతుందని** ('.. we are alramed as if his horses had wings to fly over our walls..') అని అన్నాడు.

ఈ మేరకు టిపూ మిత్రులు మాత్రమే కాకుండా ఆయనతో నువ్వా ? నేనా ? అని తలపడిన ఆంగ్లేయాధికారులు, ఆయన అంటే గిట్టని పలువురు చరిత్రకారులు కూడా టిపూ శక్తి సామర్థ్యాలను కొనియాడక తప్పని పరిస్థితిని చూస్తే, యుద్ధతంత్ర నిపుణుడిగా టిపూ ఎంత శక్తివంతుడో అవగతమవుతుంది.

## మలుపులు తిప్పిన మైసూరు యుద్ధాలు

ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులతో, స్వార్థపరులైన స్వదేశీ పాలకులతో పలు పోరాటాలు చేసినా, బ్రిటీష్ సైనిక కూటమితో టిపూ తండ్రి హైదర్, టిపూ చేసిన ప్రధాన పోరాటాలు **మైసూరు యుద్ధాలు** గా చరిత్రలో ప్రత్యేకతను సంతరించుకున్నాయి. ఈ యుద్ధాలలో మొదటి రెండింటిని టిపూ, హైదర్ అలీ కలసి చేయగా, చివరి రెండు టిపూ సాగించినవి. ఈ చారిత్రిక యుద్ధాలలో మెదటి రెండు యుద్ధాలు టిపూకు అనుకూలంగా పరిణమించగా, చివరి రెండు ప్రతికూలమయ్యాయి. టిపూ సుల్తాన్‌కు ప్రతికూలంగా సాగిన ఈ రెండు యుద్ధాలు మాత్రం భారతదేశం క్రమంగా బ్రిటీషర్ల పెత్తనంలోకి జారి పోడానికి బాటలు వేశాయి. ఈ పోరాటాలు టిపూ పాలిట శాపాలుగా మారటంతో బ్రిటీషర్లు ఈ గడ్డ మీద స్థిరపడి, తమ పట్టును బిగించగలిగారు.

## ప్రథమ మైసూరు యుద్ధం (176-69)

ప్రథమ మైసూరు యుద్ధంలో హైదర్ అలీ మార్గదర్శకత్వంలో బ్రిటీషర్ల, వలస పాలకులకు మద్దతు పలికిన స్వదేశీ శక్తులు నిజాం, మరాఠాలకు బుద్ధి చెప్పేందుకు సాగించారు. ఈ పోరాటంలో టిపూ నేతృత్వంలోని సేనలు అప్రతిహతంగా ముందుకు సాగాయి. ఆ సమయంలో టిపూ వయస్సు 17 సంవత్సరాలు. 1769 మార్చి మాసంలో

దక్షణ భారత దేశంలో ఈస్ట్ ఇండియా కంపెనీకి ప్రధాన కేంద్రమైన మద్రాసుకు 5 మైళ్ళ దూరం వరకు మైసూరు రాజ్య సేనలు వచ్చి చేరాయి. ఈ వ్యతిరేక పరిణామాలతో హడలెత్తిన ఆంగ్ల సేనలు, ఆంగ్లేయాధికారులు కకావికలయ్యారు.

ఈ యుద్ధంలో, 1763 నాటి బక్సర్ యుద్ధంలో మీర్ ఖాశిం, షా ఆలం, షుజావుద్దౌలా లాంటి స్వదేశీ పాలకుల సంయుక్త సేనల కూటమిని పరాజితులను చేసి విజేతగా కిరీటం ధరించిన ఆంగ్లేయాధికారి Sir Hector Munro హైదర్ అలీ, టిపూల పరాక్రమానికి విస్తుపోతూ బ్రతికుంటే బలుసాకు తిని జీవించవచ్చని కంజీవరంలోని చెరువులో ఆయుధాలను పారేసి బ్రతుకు జీవుడా అంటూ పారిపోయాడు. (TIPU SULTAN : HIS VISION AND MISSION, By Prof. B. Sheik Ali, Published in Radiance Views Weekly 1-7 August 1999, Page. 15)

ఈ పరిణామాల మూలంగా ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రతిష్ట దిగజారి, కంపెనీ షేర్ల ధర 275 నుండి 222కు పడిపోయింది. ( Eminent Muslim Freedom Fighers, G.Allana, Page 58) ఇండియాలోని పలు ప్రాంతాలను ఆక్రమించుకుంటూ అపరిమితమైన సంపదను పోగేసుకుంటున్న ఈస్ట్ ఇండియా కంపెనీకి మద్రాసులో హైదర్ అలీ కల్పించిన పరాజయం అశనిపాతమైంది. ఈ పరాజయం లండన్ స్టాక్ మార్కెట్టులో సంక్షోభానికి కారణం కావటమే కాకుండా, “మీరు ఊహించనలవి కాని కష్టాను తెచ్చిపెట్టారు. వాటి నుండి బయటపడటం ఎలాపో అర్థం కావటం లేదు” అని కంపెనీ Court of Directors వాపోయారు. (" ..You have brought us into such a labyrinth of difficulties, that we do not see how we shall be extricated from them.",) మిమ్మల్ని వ్యాపారం కోసం పంపాం. హిందూస్థాన్‌లోని రాజ్యాల వ్యవహారాలలో పాల్గొనేందుకు కాదు, ( ...it is not for the Company to take the part of umpries of Indostan..) అని కంపెనీ అధికారులను హెచ్చరించారు. ఈ మేరకు ఇంగ్లాండు నుండి కంపెనీ పాలకుల నుండి భారతదేశంలోని ఆ కంపెనీ అధికారులకు తీవ్ర హెచ్చరికలు జారీ అయ్యాయంటే ఇంగ్లాండు గుండెల్లో టిపూ, హైదర్ అలీ ఎంతటి భయోత్పాతం కలిగించారో అర్థం చేసుకోవచ్చు. (An Advanced History of India, by RC Majumdar and others, Macmillan, 1996 Page 675)

ఈ విధంగా ఘోర పరాజయాన్ని చవిచూసిన ఆంగ్లేయులు మైసూరు రాజ్యాధినేతల పరాక్రమానికి తలవొగ్గి 1769లో **మద్రాసు సంధి** చేసుకున్నారు. ఈ సంధి





ప్రకారంగా మైసూరు రాజ్యం మీద ఎవరైనా దాడులు జరిపితే కంపెనీ సేనలు మైసూరు రాజ్య సైన్యాలకు అండదండలు ఇచ్చేందుకు అంగీకరించాయి. ఈ సంధితో ప్రథమ మైసూరు యుద్ధం మైసూరు రాజ్యం పక్షాన విజయవంతంగా ముగిసింది.

## రెండవ మైసూరు యుద్ధం (1780-84)

1771లో మైసూరు రాజ్యం మీద మరాఠాలు దాడులు ప్రారంభించారు. ఆ దాడులను ఎదుర్కొంటున్న హైదర్ అలీకి మద్రాసు సంధి ఒడంబడిక ప్రకారం కంపెనీ సేనలు మైసూరు సేనలకు అండగా నిలవాలి. అందుకు భిన్నంగా కంపెనీ సేనలు మరాఠాల పక్షం వహిస్తూ ఒడంబడికకు భిన్నంగా ప్రవర్తించాయి. ఆ తరువాత మైసూరు రాజ్య పరిధిలో గల ఫ్రెంచి వారి స్థావరం **మాహే** ను ఆంగ్లసేనలు ఆక్రమించాయి. ఈ ఉల్లంఘన సహించని హైదర్ అలీ 1780 జూలై మాసంలో యుద్ధం ప్రకటించారు. ఈ యుద్ధంలో తండ్రి హైదర్ అలీతో కలసి టిపూ ప్రధాన పాత్ర పోషించారు. ఈ సందర్భంగా ఆంగ్లేయాధికారులు Col. Baillie, Sir Eyre Coote, Col Briath మైసూరు రాజ్యాధినేతల చేతుల్లో పరాభవాన్ని ఎదుర్కోవాల్సి వచ్చింది. టిపూ ఆయన తండ్రి హైదర్ అలీల నేతృత్వంలో క్రమంగా విస్తరిస్తూ, బలోపేతం అవుతున్న మైసూరు రాజ్య ప్రగతిని బూచిగా చూపి నిజాం, బేరూరు రాజు, మాధవజీ సింధియాలతో హైదర్ అలీ ఏర్పాటు చేసిన స్వదేశీ పాలకుల కూటమిని కుటిల నీతితో ఆంగ్లేయులు విచ్ఛినం చేశారు.

స్వదేశీ పాలకుల కూటమి విచ్ఛిన్నమైనప్పటికి, స్వదేశీ పాలకులు పరాయి వాళ్ళ పంచచేరి శతృత్వం ప్రకటించినప్పటికి హైదర్ అలీ, టిపూ సుల్తాన్‌లు పరాక్రమిస్తూ ఆంగ్లేయులను పరాజితులను చేయసాగారు. రెండవ మైసూరు యుద్ధం కీలక దశలో ఉండగా 1782 డిసెంబరు 7వ తేదీన హైదర్ అలీ యుద్ధ రంగంలో మరణించారు.

ఈ వార్త టిపూకి అందే నాటికి ఆయన మలబారు తీరాన కల్నల్ హంబర్ స్టోన్‌ను తరిమి కొడుతున్నారు. తండ్రి కన్నుమూసిన వార్త విన్న టిపూ సత్వరమే శ్రీరంగపట్నం చేరుకుని, 1782 డిసెంబర్ మాసంలో మైసూరు రాజ్యలక్ష్మిని చేబట్టిన టిపూ, **మైసూర్ సుల్తాన్** అయ్యారు.

తండ్రి హైదర్ అలీ అడుగుజాడలలో టిపూ కూడా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ముందుకు సాగారు. స్వదేశీ గడ్డ మీద విదేశీయుల పొడ కూడా సహించని టిపూ బ్రిటీష్ శక్తులను తరిమికొట్టేందుకు ప్రతిన పూనాడని E.Marsden అను ఆంగ్లేయ

చరిత్రకారుడు పేర్కొన్నాడు.(He hated the English and had openly vowed that he would someday drive them out of India - History of India By E.Marsden, Macmillan, London, 1944 Page157). ఈ యుద్ధంలో టిపూ Brigadiar Mathews ను 1783లో బంధించారు. ప్రథమ మైసూరు యుద్ధంలోలా రెండవ మైసూరు యుద్ధంలో కూడా చేదు అనుభవాలను చవిచూసిన కంపెనీ అధికారులు టిపూతో సంధిచేసుకున్నారు. 1784 మార్చి మాసంలో ఇరుపక్షాల మధ్య **మంగళూరు సంధి** (Treaty of Mangalore) కుదిరింది.

ఈ రెండు యుద్ధాలు మైసూరు పాలకులకు అనుకూలంగా సాగగా, కంపెనీ అధికారుల మెడలు వంచి తమ షరతులకు అనుగుణంగా ఒడంబడికలు రూపొందించి అధిపత్యం చాటుకుని టిపూ సుల్తాన్ తమది పై చేయిగా నిరూపించుకున్నారు.

## మూడవ మైసూరు యుద్ధం (17౯౦-౯౨)

తిరువాన్కూరు సంస్థానాధీశునితో టిపూకు వచ్చిన వివాదం సాకుగా, ఒప్పం దాన్ని ఉల్లంఘించి ఆంగ్లేయులు టిపూను రెచ్చగొట్టిన కారణంగా మూడవ మైసూరు యుద్ధం 1790 మే మాసంలో ఆరంభమైంది. (Lord Coronwallis forced Teepu by violating the treaty " to Produce war with that Prince " - History of Freedom Movement in India, Vol. 2, Tara Chand, Govt. Of India Publications, New Delhi 1992, Page. 226)

ఈ యుద్ధం రెండు సంవత్సరాలు సాగింది. ఆంగ్లేయాధికారి Major General Medows నేతృత్వంలో ఆరంభమై ఈ యుద్ధం తొలి దశలో టిపూ విజయ పరంపర సాగింది. పరాజితుడైన Major General Medows ఓ దశలో పరాభవాన్ని భరించలేక ఆత్మహత్యకు ఉపక్రమించాడు. ఈస్ట్ ఇండియా కంపెనీ నిధులు కూడా చాలా కరిగిపోయాయి. ఈ దశలో యుద్ధ రంగాన టిపూ అద్భుత నైపుణ్యం మరియు ఎత్తుగడలను అనుసరించారని, అందుకు దీటుగా తన అధికారులు వ్యవహరించలేక పోయారని భావించిన లార్డ్ కారన్‌వాలిస్ (Lord Cornwallis) స్వయంగా యుద్ధరంగప్రవేశం చేశాడు. 1791 జనవరిలో అతను బ్రిటీష్ సైనిక కూటమి నాయకత్వ బాధ్యతలను చేపట్టాడు.

టిపూ వ్యతిరేక శక్తులకు ఆశలు చూపెట్టి, భయం కల్గించి టిపూకు దూరం చేయటమేకాకుండా లార్డ్ కారన్‌వాలిస్ తనకు అనుకూలం చేసుకున్నాడు. ఈ వాతావరణంలో మరింత ఉత్సాహంతో టిపూను పరాజితుడ్ని చేయ సంకల్పించిన స్వదేశీ







యుద్ధ నష్టపరిహారంగా టిపూ తనయుల పూచీకత్తు

పాలకులు మైసూరు రాజ్యం మీద విరుచుకపడ్డారు. భారీగా బలగాలను సమకూర్చుకుని మే మాసం నాటికి శ్రీరంగపట్నానికి తొమ్మిది మైళ్ళ సమీపానికి చేరుకున్నారు.

ఆ సమయంలో టిపూ పాండిచ్చేరిలో ఉన్నారు. ఈ విషయం తెలుసుకున్న ఆయన ఆఘమేఘాల మీద శ్రీరంగపట్నం కదిలారు. ఆ సమయంలో వర్షాలు ఆరంభం కావటంతో కారన్‌వాలిస్ తాత్కాలికంగా యుద్ధ రంగం నుండి తప్పుకున్నాడు. 1792 జనవరి నాటికి లార్డ్ కారన్‌వాలిస్ శ్రీరంగపట్నానికి తిరిగి చేరుకుని అన్ని వైపుల నుండి మైసూరు రాజ్య రాజధానిని చుట్టుముట్టాడు. కంపెనీ సేనలు రాత్రిపూట టిపూ బలగాల మీద విరుచుకుపడ్డాయి. మరోవైపున స్వదేశీ పాలకులు, పాలెగాళ్ళు ఏకమై టిపూను చుట్టుముట్టారు. భయానక యుద్ధం జరిగింది. ఈ ప్రతికూల పరిస్థితులలో శ్రీరంగపట్నం కోటలోకి టిపూ నిష్క్రమించారు. శతృసైన్యాల కూటమితో కారన్‌వాలిస్ కావేరి నదిని దాటి కోట సమీపానికి చేరుకున్నాడు. శ్రీరంగం కోటను పూర్తిగా దిగ్బంధనం చేశాడు. ఆ పరిస్థితులు టిపూకు ప్రమాదకరంగా పరిణమించాయి.

గత్యంతరం లేని యుద్ధ వాతావరణంలో శతృవు బలగాలు, శతృవుకు తోడుగా నిలచిన స్వదేశీపాలకుల అపార సైనిక బృందాలను గమనించిన టిపూ యుద్ధ పర్యవసానాన్ని ఊహించారు. అన్ని విధాలుగా పై చేయిలో ఉన్న శత్రుపక్షం పెచ్చరిల్లితే మైసూరు రాజ్యలక్ష్మి పరాయిపాలు కాగలదని ఆయన అంచనా వేశారు. ఈ సందర్భంగా ప్రజల సంక్షేమం నిమిత్తం ఆయన సంధికి సిద్ధపడ్డారు. ఆంగ్లేయాధికారులు,

వలసపాలకులకు తొత్తులుగా మారిన స్వదేశీ పాలకులు సంధి షరతులను నిర్దేశించారు. సంధి షరతులు కఠినంగా ఉన్నా కూడా భవిష్యత్తును దృష్టిలో ఉంచుకుని టిపూ సంధికి అంగీకరించారు.

ఈ మేరకు **శ్రీరంగపట్నం సంధి** 1792 మార్చిలో కుదిరింది. ఈ సంధి ప్రకారంగా టిపూ తన రాజ్యంలోని సగం ప్రాంతాలను ఆంగ్లేయ కూటమికి అప్పగించాల్సి వచ్చింది. ఈ ప్రాంతాలను నిజాం, మరాఠా పాలకులు, ఈస్ట్ ఇండియా కంపెనీ పంచుకున్నారు. రాజ్యభాగాన్ని శతృకూటమికి సమర్పించటం మాత్రమే కాకుండా ముప్పై లక్షల పౌండ్ల నష్ట పరిహారం కూడా టిపూ చెల్లించాల్సి వచ్చింది.

(He has to pay a war Indeminty of 3 1/2 Croes of rupees, - Brief History of Andhra Pradesh, Ed. by Mohd. Abdul Waheed Khan, Govt. of AP, Hyderabd, 1972, Page 91)

ఈ భారీ మొత్తాన్ని పూర్తిగా చెల్లించే వరకు శత్రుకూటమి టిపూ బిడ్డలిరువుర్ని తమ వద్ద ఉంచాలని షరతు విధించింది. ఈ షరతు మేరకు తప్పనిసరి పరిస్థితులలో టిపూ తన బిడ్డలను ఆంగ్లేయాధికారుల వద్ద పూచీకత్తుగా ఉంచారు. సంధి షరతుల మేరకు మూడున్నర కోట్ల రూపాయలను ఆంగ్లేయులకు చెల్లించిన తరువాత గాని టిపూ తన బిడ్డలను బ్రిటీషర్ల పంచ నుండి విముక్తం చేయలేకపోయారు. మాతృభూమిని విదేశీ శక్తుల నుండి విముక్తం చేయాలని అహర్నిశలు పోరాడుతున్న టిపూకు స్వదేశీ పాలకుల సహకారం లభించక పోవటమే కాకుండా పరాయి పాలకుల, ఆ పాలకుల వత్తాసుదారుల పట్ల శత్రుత్వం వహించినందున తన బిడ్డలను కూడా **పూచీకత్తు** ఉంచాల్సిన పరిస్థితి రావటం విచారకరం.

ఈ యుద్ధ పరిణామాలు టిపూ మనస్సును తీవ్రంగా కలచివేశాయి. ఈ యుద్ధంలో బ్రిటీషర్లకు విజయం లభించటంతో, భారత దేశంలో కంపెనీ పాలన నిలదొక్కుకోడానికి కారణమైంది. స్వదేశీ పాలకుల స్వాతంత్ర్య పరిరక్షణా పోరాట చరిత్రలో మూడవ మైసూరు యుద్ధం దురదృష్టకర సంఘటనగా నిలిచిపోయింది.

## నిర్ణయాత్మక నాల్గవ మైసూరు యుద్ధం (1799)

మూడవ మైసూరు యుద్ధ పరిణామాల మూలంగా టిపూ దెబ్బతిన్న పులిలా ఉన్నాడు కనుక, ఆయన నుండి ఎప్పుడైనా పెనుప్రమాదం పొంచి ఉందని భయపడిన విదేశీ పాలకులు, ఆ పాలకులకు మద్దతు పలుకుతున్న స్వదేశీ పాలకులు, పాలెగాళ్ళు దెబ్బతిని ఉన్న మైసూరు పులి టిపూను ఎలాగైన అంతం చేయాలని నిర్ణయించుకున్నారు.





టిపూ సజీవంగా ఉన్నంత కాలం రాజ్య విస్తరణకు అవకాశం ఉండదని కంపెనీ పాలకులు నిర్ణయించారు. ఆ నిర్ణయం మేరకు నాల్గవ మైసూరు యుద్ధం కోసం ఏర్పాట్లు ఆరంభించారు.

ఈ వాతావరణం గ్రహించిన టిపూ తన ప్రయత్నాలలో తానూ ఉన్నారు. స్వదేశీ పాలకుల మద్దతు లభించకపోవటంతో, బ్రిటీషర్లను వ్యతిరేకించే బయటి శక్తుల సహాయం కోసం ఆయన ప్రయత్నాలు ప్రారంభించారు. ఆయన కాబూల్, కానిస్టాంట్‌నోపల్, అరేబియా, మారిషస్ తదితర రాజ్యాధినేతలకు కూడా లేఖలు రాశారు. బ్రిటీషర్లను పాలద్రోలేందుకు సహకరించాల్సిందిగా కోరుతూ దౌత్యఅధికారులను పంపారు. టిపూ తండ్రి హైదరాలి హయాం నుండి మైసూరు రాజ్యానికి చిరకాల మిత్రులైన ఫ్రెంచ్ వారి సహాయాన్ని ఆయన కోరారు. ఆనాడు ఇంగ్లీషు వారికి, ఫ్రెంచ్ వారికి మధ్యనున్న విభేదాల వలన టిపూకు సహకరించేందుకు ఫ్రెంచ్ అధికారులు అంగీకరించారు. 1798 ఏప్రిల్ మాసంలో కొందరు ఫ్రెంచ్ అధికారులు మాంగళూరుకు చేరుకున్నారు.

టిపూ మైసూరు రాజ్య రక్షణకు సాగిస్తున్న ప్రయత్నాల గురించి తెలుసుకున్న బ్రిటీష్ గవర్నర్ జనరల్ వెల్లస్లీ (Governor General Marquis Wellesly) మండిపడ్డాడు. పశ్చిమ తీరాన ఉన్న టిపూ బలగాలను తొలగించాల్సిందిగాను, రెండు కోట్ల పూచికత్తును చెల్లించి, మైసూరు రాజ దర్బారులో తమ ప్రతినిధిని అనుమతించా



ఇన్‌సెట్‌లో యుద్ధభూమిలో బ్రిటీషర్లతో పోరాడుతున్న మైసూరు పులి

ల్సిందిగా అల్టిమేటం పంపాడు. ఈ చర్యతో టిపూ ఆగ్రహిస్తూ వెల్లస్లీ బెదిరింపులను బేఖాతర్ అన్నారు. అవకాశం కోసం ఎదురు చూస్తున్న అంగ్లేయులు మైసూరు రాజ్యాన్ని కబళించేందుకు సన్నాహాలను ముమ్మరం చేశారు.

1798 ఏప్రిల్ 26న అంగ్లేయాధికారి ఆర్థర్ వెల్లస్లీ (Arthur Wellesly) మద్రాసు చేరుకున్నాడు. టిపూ మీద యుద్ధాన్ని ప్రకటించాడు. టిపూను ఎదుర్కోడానికి అందుబాటులో ఉన్న ఉత్తమ సైనిక పటాలాలను అతి తక్కువ కాలంలో (the finest army in the shortest period) రప్పించుకున్నాడు. తాయిలాల ఆశ చూపి ఆదరించి బెదిరించి నిజాం నవాబును పూర్తిగా తమ గుప్పెట్లోకి తెచ్చుకున్నాడు. పలు ప్రాంతాల మరాఠా ప్రభువులను మాలిమి చేసుకున్నాడు. భారీ ఎత్తున యుద్ధ సన్నాహాలను పూర్తి చేసుకుని ఆక్రమణకు ఉపక్రమించారు. టిపూ సుల్తాన్ రాజ్యం మీద అన్ని వైపుల నుండి దాడులు జరపాలని కంపెనీ సైనికాధికారులకు, కంపెనీకి మద్దతునిస్తున్న స్వదేశీపాలకులు, పాలెగాళ్ళకు 1799 ఫిబ్రవరి 3వ తేదీన ఆదేశాలు జారీ చేశాడు. ('..on 3rd February 1799, for the British arimes and those of the allies, immediately to invade the Sultan's dominions.' ) స్వంత బలగాలను సమకూర్చుకుని, టిపూను ఏకాకి చేసి స్వదేశీ పాలకులతో, మద్దతుదారులతో కలసి టిపూను పరాజితుడ్ని చేయడానికి పకడ్బందీగా పథకాన్ని రూపొందించాడు.

ఈ మేరకు సమాచారాన్ని అందుకున్న టిపూ తన ప్రయత్నాలను మరింత ముమ్మరం చేశారు. శ్రీరంగపట్నం కోటను బలిష్టం చేశారు. సొంతగడ్డ రక్షణ కోసం ప్రాణాలిచ్చే సైనికులను సమకూర్చుకున్నారు. దురదృష్టకర పరిస్థితులకు లొంగిపోకుండా విదేశీ శతృవుకు, ఆ శక్తికి వత్తాసు పలుకుతన్న స్వదేశీపాలకులకు బుద్ధి చెప్పాలని నిర్ణయించుకున్నారు. చివరి పోరుకు టిపూ సిద్ధమయ్యారు. శ్రీరంగపట్నం మీదకు తరలి వస్తున్న శతృబలగాలను పరిమిత ఒనరులతో, బలగాలతో ఎదుర్కొనేందుకు సన్నద్ధమయ్యారు. 1779 ఏప్రిల్‌లో శ్రీరంగపట్నానికి 45 మైళ్ళ దూరంలో గల సెడ్సీర్ (Sedaser) అను ప్రాంతంలో, మే 4వ తేదిన శ్రీరంగపట్నానికి 35 మైళ్ళ దూరంలో ఉన్న మావెల్లీ (Malvelly) అను ప్రాంతం వద్ద ఆంగ్లేయాధికారులు Sturat మరియు General Haris లతో టిపూ తలపడ్డారు. ఈ రెండు ప్రాంతాలలో విజయం ఆంగ్లేయ కూటమికి దక్కింది.





# మృత్యుంజయుడు టిపూ

టిపూ సుల్తాన్ గత్యంతరం లేని పరిస్థితులలో శ్రీరంగపట్నం కోటలోకి వెళ్ళారు. ఆ కోటను అన్ని వైపుల నుండి ఆంగ్లేయాధికారుల బలగాలు, స్వదేశీ పాలకుల సైన్యాలు, పాలెగాళ్ళ బృందాలు చుట్టుముట్టాయి. ఈసారి శ్రీరంగపట్నం ముట్టడి భారీ స్థాయిలో ప్రారంభమైంది. కర్నాటక వైపు నుండి జనరల్ హరిస్, కూర్గ్ నుండి జనరల్ స్టూవర్ట్, హైదరాబాదు నుండి లార్డ్ వెల్లస్లీ, దక్షిణం వైపునుండి కల్నల్ రోడ్, కల్నల్ బ్రౌన్ శ్రీరంగపట్నంలోని టిపూను చుట్టు ముట్టారు. నిజాం, మరాఠా పాలకులు, పాలెగాళ్ళు, వెల్లస్లీ కలలను నిజం చేయడానికి కంపెనీ సైన్యాలకు తోడుగా నిలిచారు. నిజాం సైన్యాలకు అర్థర్ వెల్లస్లీ స్వయంగా నాయకత్వం వహించాడు.

చివరకు 1799 మే మాసం 4వ తేదిన, ఆంగ్లేయ కూటమికి టిపూకు మధ్యన భయంకరమైన యుద్ధం ప్రారంభమైంది. ఆంగ్లేయ కూటమి అపార బలగాలు చీమల దండులా శ్రీరంగపట్నం మీద విరుచుకు పడుతున్నాయి. టిపూ బలగాలు శతృసైనికులను కోట బురుజుల నుండి ఎదుర్కొంటున్నారు. టిపూ స్వయంగా పోరాటాన్ని పర్యవేక్షిస్తున్నారు. సుల్తాన్ పట్ల విధేయులైన సైనిక యోధులు ప్రాణాలకు తెగించి పోరాడుతున్నారు. ఈ యోధుల ధాటికి శ్రీరంగపట్నం కోట సమీపానికి శతృవు చేరుకున్నా కోట లోనికి ప్రవేశించలేకున్నాడు.




టిపూ కోటలోకి శత్రు సైన్యం ప్రవేశించిన వాటర్ గేట్

శత్రువు తన కుయుక్తులకు శ్రీకారం చుట్టాడు. అధికార దాహంతో అక్రమంగానైనా రాజ్యాధికారం చేపట్టాలని ఉవ్విళ్ళూరుతున్న అధికారమదాంధులు ఆపాటికి ఆంగ్లేయులకు దాసోహం అన్నారు. ఈ కుట్రలు, అంతర్గత శత్రువుల ఎత్తులను టిపూ గూఢచారి బలగాలు కనిపెట్టలేక పోయాయి. అత్యంత పకడ్బందీగా సాగిన కుట్ర వివరాలు టిపూకు తెలియలేదు. ఈ కుట్రకు మూలకారకుడు టిపూ దివాన్ మీర్ సాధిక్. అతగాడు రాజ్యకాంక్షతో బ్రిటీషర్లతో చేతులు కలిపాడు. టిపూ రాజ్యంలోని మరికొందరు పాలెగాళ్ళు టిపూ మిత్రులుగా నటిస్తూ, బ్రిటీషర్ల మేలుకోరసాగారు.

శ్రీరంగపట్నం కోట గోడలను విధ్వంసం చేయడానికి ఆంగ్లేయ కూటమి శత విధాల ప్రయత్నిస్తుంది. ఆ సమయంలో అంతర్గత శత్రువు మీర్ సాధిక్ రంగంలోకి వచ్చాడు. ఆంగ్లేయాధికారులకు, కంపెనీ సైనికులకు కోట గోడలు బలహీనంగా ఉన్న ప్రాంతాన్ని తెలియచేస్తూ, టిపూ ప్రాసాదానికి సమీపానున్న **వాటర్ గేటు** ద్వారా కోటలోనికి ప్రవేశించటం సులువన్న రహస్యాన్ని శత్రువుకు చేరవేశాడు. టిపూ ప్రాసాదానికి వాటర్ గేటు చాలా సమీపాన ఉంది. అక్కడ టిపూ సైనికులు ఎంతో జాగ్రత్తతో పహరా కాస్తున్నారు. ఆ సైనికులను అక్కడ నుండి తొలిగించి, ఆంగ్లేయ సైన్యాలను కోటలోకి



**శ్రీరంగపట్నం ముఖద్వారం వద్ద టిపూ సుల్తాన్ మృతి చెందిన స్థలం**





తేలిగ్గా ప్రవేశింపచేసేందుకు మీర్ సాధిక్ కుట్ర పన్నాడు. అక్కడ పహరాకాస్తున్న సైనికులకు జీతాలు చెల్లిస్తున్నారని అసత్యాలు చెప్పి, ఆ కీలక ప్రాంతం నుండి తప్పించాడు. ఆలోగా శత్రు సైనిక బలగాల ఫిరంగులు కోట గోడను మరింత బలహీనపర్చాయి. మీర్ సాధిక్ శతృసైనికులకు స్వాగతం పలుకుతూ కోటలోకి మార్గం చూపాడు.

మీర్ సాధిక్ స్వామి ద్రోహం వలన ఆంగ్లేయ సైన్యాలు ఎటువంటి ప్రతిఘటన లేకుండా వాటర్ గేటు గుండా కోటలోకి జొరబడ్డాయి. శత్రువు కోటలోకి ప్రవేశించటంతో టిపూ సైన్యాలలో కలకలం ప్రారంభమైంది. ఆ అదను కోసం ఎదురు చూస్తున్న మీర్ సాధిక్ తన పని పూర్తయ్యిందన్న తృప్తితో కోట నుండి తప్పించుకొని రహస్య మార్గం ద్వారా బయటపడి ఆంగ్లేయ యజమానులను చేరేందుకు త్వరపడుతూ ఆ దిశగా ప్రయత్నాలు ప్రారంభించాడు.

బ్రిటీష్ సైన్యం అన్ని వైపుల నుండి టిపూను చుట్టుముట్టింది. ఆ క్లిష్ట సమయంలో అందలం ఎక్కాలన్న దురాశతో స్వామిద్రోహానికి పాల్పడిన మీర్ సాధిక్ కోట నుండి ఆంగ్లేయ శిబిరంలోకి జారుకుంటూ, టిపూ సుల్తాన్‌కు నమ్మినబంటు అయినటువంటి సైనికాధికారి శ్రీ కృష్ణారావు కంటబడ్డాడు. మీర్ సాదిఖ్ ప్రవర్తనను అనుమానించిన శ్రీ కృష్ణారావు అతనిని తన దగ్గరికి పిలిచారు. టిపూ సుల్తాన్ కోట బయటకు పంపుతున్న ఓ రహస్య సందేశం తన వద్ద ఉందని, దానిని శతృవు చేతికి చిక్కనివ్వకుండా బయటకు పంపాలని మీర్ సాధిఖ్‌కు నమ్మబలికారు. ఆ రహస్య సందేశం ఏమిటో తెలుసుకోదలచిన స్వామిద్రోహి తిన్నగా కృష్ణారావును సమీపించాడు. ఆ ప్రయత్నంలో కృష్ణారావుకు కత్తివేటు దూరానికి మీర్ సాధిఖ్ రాగానే ఒక్కదుటన పైకి ఎగిరిన కృష్ణారావు, **సుల్తాన్ శత్రువు ముట్టడిలో చిక్కుబడిపోతే నువ్వెక్కడికిరా పోతున్నావు? ద్రోహీ'** అంటూ తన కత్తిని సాధిఖ్ గుండెల్లో దించాడు. అంతటితో ఆ స్వామిద్రోహి మీర్ సాధిఖ్ బ్రతుకు అంతమైపోయింది.

ఈ విధంగానే సరిగ్గా 50 సంవత్సరాల క్రితం 1757లో బెంగాలు సవాబు సిరాజుద్దౌలాకు ద్రోహం చేసిన మీర్ జాఫర్ లాగే, 1799లో మీర్ సాధిఖ్ స్వామి ద్రోహానికి పాల్పడి పరాయి పాలకులకు సహకరించడం చారిత్రక విషాదం. అనాడు మీర్ జాఫర్ స్వామి ద్రోహానికి పాల్పడినందున వలసపాలకులు ఈ గడ్డ మీద స్థిరంగా కాలు మోపగలిగారు. ఈసారి మీర్ సాధిక్ అటువంటి నీచానికి పాల్పడి కంపెనీ పాలకులు ఈ గడ్డ మీద గట్టిపునాదులు నిర్మించుకునేందుకు సహాయపడ్డాడు.

## టిపూ జీవితంలో చివరి రోజు...

టిపూ సుల్తాన్ ఆయన తండ్రి హైదర్ అలీల చరిత్రను మొగల్ సామ్రాజ్యంలో సైనికాధికారిగా పనిచేసిన వ్యక్తి (Mr. M.M.D.L.T) రాసి, టిపూ కుమారుడు Prince Gholam Mohammed చే సవరింపడిన ప్రఖ్యాత గ్రంథం The History of Hyder Shah, alias Hyder Ali Khan Bahadur, and his son, Teppoo Sultan లో టిపూ యుద్ధరంగంలో సాగించిన పోరాటాన్ని వివరించారు. ఆ వివరాలను Eminent Muslim Freedom Fighters పుస్తకంలో ఆ పుస్తక రచయిత G.Allana విస్తారంగా ఉటంకించారు.

1799 మే నాల్గవ తేది. ఆరోజున, అప్పటి వరకు కుట్రలు, కుయుక్తులు, ఎత్తులు, చిత్తులు, ఎత్తుగడలతో సాగుతున్న యుద్ధాన్ని అంతవరకు పర్యవేక్షించి, అప్పుడే అల్పాహారం స్వీకరించడానికి టిపూ తన ప్రాసాదానికి వచ్చారు. ఆయన కుటుంబీకులు అందించిన అల్పాహారం తినడం ప్రారంభించారు. ఆ సమయంలో ఆయన ప్రాసాదానికి సమీపాన గల వాటర్ గేటు వద్ద సైనికుల కలకలం వినవచ్చింది. ఆ కలకలం విని



**టిపూ భౌతిక కాయాన్ని గుర్తించిన బ్రిటిష్ సైన్యాధికారి జనరల్ హారిస్**





అల్పాహారాన్ని పూర్తి చేయకుండానే లేచి వచ్చి పరిస్థితిని వీక్షించారు. స్వామిద్రోహులు చేసిన నమ్మకద్రోహం, శతృవుల కోటలోకి ప్రవేశం తదితర అంశాలను తక్షణమే గ్రహించారు. దుర్భేధ్యమైన కోటలోకి శతృసైన్యాలు భారీ సంఖ్యలో జొరబడిన విషయం గమనించారు. పరిస్థితులు చేతులు దాటిపోయాయి.

ఆ సమయంలో టిపూ ఆంతరంగికులు ఆయనను కోట నుండి తప్పించు కోవాల్సిందిగా కోరారు. ఆ సలహా ఆయనకు రుచించలేదు. ఆంగ్లేయుల మీద, వారి వత్తాసుదారుల మీద, తిరుగులేని పోరాటం సాగించాల్సిందేనని నిర్ణయించుకున్నారు. విజయమో లేక వీరస్వర్గమో తప్ప మరొక ఆలోచన ఆయన మదిలోకి రాలేదు. ఆప్తులు, మంత్రులు, అధికారులు ఎంతగా వలదని వారిస్తున్నా ఆయన వినలేదు.

చివరకు **'నక్క లాగా రెండు వందల సంవత్సరాలు బ్రతికే కంటే సింహంలా రెండు రోజులు బ్రతికిన చాలు' అని అంటూ టిపూ యుద్ధభూమిలోకి ప్రవేశించారు. ఈ సందర్భంగా, ' అమర్యాదకర బానిస బ్రతుకు బ్రతికేకంటే శిరస్సుల మీద రక్త ధారలను కురిపిస్తున్న యుద్ధమేఘాల క్రింద మరణించటం ఎంతో మేలు కదా భగవం తుడా!'** అని ఆయన వ్యాఖ్యానిస్తూ శత్రు సైనికులలో చొరబడ్డారు.

( ' Better a lion's life for two days than a Jackal's life for two hundred years...Ya Allah, it is better to die beneth the coulds of battle raining blood upon our heads than to live of shame and degradation ' - BN Pande : Page. 15)

కంపెనీ సైన్యం వరదలా కోటలోకి చొచ్చుకువస్తూ, కోటలోని ప్రతి అంగుళాన్ని ఆక్రమించుకుంటున్నా, ఆ సైన్యాన్ని నిలువరించడానికి సరిపడ బలగాలు తనవెంట లేకపోయినా స్థిర నిశ్చయంతో ముందుకు సాగుతున్న టిపూ ఏమాత్రం అధైర్యపడలేదు. అధైర్యపడటం ఆయన జీవితంలోనే ఎరుగని ఆ యోధుడు ఒక్క అడుగు కూడా వెనక్కు వేయలేదు. శత్రువుతో సంకుల సమరానికి సిద్ధమై శతృసైన్యాల మధ్యకు ఆయన దూసుకుపోయారు. శతృ సైన్యాలు, ఆంగ్లేయాధికారులు కనీసం టిపూను సమీపించడానికి భయపడేంతగా రణభూమి అంతటా తానై కన్పిస్తూ, శతృసైన్యాలలో భయోత్పాతం కల్గిస్తున్నారు. శతృసైన్యాలను చెండాడుతూ రణరంగంలో దూసుకుపోతున్న టిపూకు రక్షణ కరువైంది. సన్నిహితులు-సహచరులు లేరు. అంగరక్షకులు లేరు. ఆత్మీయులు పలువురు రాజ్య రక్షణలో హతులయ్యారు.

అయినా కూడా ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులతో అమీతుమీ తేల్చుకోవడానికి సిద్ధమైన టిపూ శతృసైనికులను తునుమాడుతుండగా, తుపాకి గుండొకటి దూసుకు

వచ్చి ఆయనను తాకింది. ఆ మరుక్షణమే మరొకటి తుపాకి గుండు ఆయన శరీరంలోకి జొరబడింది. టిపూ అశ్వం కూడా తుపాకి గుండ్ల తాకిడితో కూలబడింది. టిపూ గుర్రం మీద నుండి క్రిందకు జారిపోయారు. ప్రపంచ ప్రసిద్దమైన ఆయన తలపాగా సుల్తాన్ శిరస్సు నుండి తొలగిపోయింది. ఆ అపత్కర పరిస్థితులలో గాయపడిన సుల్తాన్‌ను రక్షించుకునేందుకు కనీస సహాయం కూడా అందించలేని దుస్థితి.

టిపూ శరీరంలో జొరబడిన తుపాకి గుండ్లు కల్గిస్తున భయంకర బాధను భరిస్తూ కూడా లేచి నిల్చోడానికి శత విధాల ప్రయత్నించి ఆయన విఫలమయ్యారు. ఒక వైపు శరీరంలో రక్తమంతా భూమిని తడిపేస్తున్నా నీరసం ఆవహిస్తున్నా క్రమంగా ప్రాణం పోతున్నా,తన చేతిలోని ఖడ్గాన్ని మాత్రం ఆయన వదలలేదు. టిపూ తలపాగా ఊడి పోవటంతో, సామాన్య సైనికుల మృతదేహాల మధ్యన పడిఉన్న ఆయన ఎవరో కూడా గమనించలేని గందరగోళ పరిస్థితులు ఏర్పడ్డాయి.

ఆ సమయంలో యుద్ధ వాతావరణం కొంత తగ్గు ముఖం పట్టింది. టిపూ సైనికుల నుండి ప్రతిఘటన కరువైంది. శతృసైనికులు భారీ సంఖ్యలో కోటలోకి జొరబడ్డారు. ఆ సైనికులకు చర్యలకు అడ్డులేకపోయింది. అందినంత దోచుకోసాగారు. కోటలో ప్రజలకు రక్షణ కరువు కావటంలో విధ్వంసం, దోపిడి యధేచ్ఛగా సాగుతుంది.



**టిపూ భౌతిక కాయం వద్ద రోదిస్తున్న ఆంతరంగికులు**





టిపూ తుపాకి గుండు కలిగించిన తీవ్రమైన గాయం వలన రగిలిన బాధను పళ్ళబిగువున భరిస్తూన్నారు. అసమయంలో ఆంగ్లేయ కూటమికి చెందిన ఓ సైనికుడి చూపు టిపూ నేలకొరిగిన ప్రాంతంలో ఆయన ఖడ్గం, ఆయన ధరించిన విశిష్టమైన బెల్టు మీద పొదిగిన బంగారం, వజ్రాల మీద పడింది. అత్యంత విలువైన ఆ బంగారం, వజ్రాలను వశపర్చుకోవచ్చున్న ఆశ అతనిలో కలిగింది. నేలకొరిగియున్న ఆ ఖడ్గధారి టిపూ అని అతనికి తెలియదు. ఆ విషయం తెలిసి ఉంటే ఆ **మైసూరు పులి** సమీపానికి కూడా ఎవ్వరూ రాగలిగేవారు కారు. టిపూ నిస్త్రాణంగా ఓ పక్కకు ఒరిగి ఉన్నారు. అవకాశం చిక్కింది కదా అని, అ సైనికుడు టిపూ బెల్టు, ఖడ్గాన్ని ఊడబెరుక్కోడానికి సాహసించి టిపూను సమీపించాడు. శత్రు సైనికుడు సమీపిస్తున్నాడని గమనించిన టిపూ తన శరీరంలోని బలాన్నంతా కూడదీసుకొని తన బెల్టు, ఖడ్గాన్ని తస్కరించ చూసిన శత్రు సైనికుడ్ని తన కరవాలానికి ఎర చేసారు.

మృతుడనుకున్న వ్యక్తి అకస్మాత్తుగా కత్తి దూయటం, క్షణాలలో ఆ సైనికుడి ప్రాణాలు తోడేయ్యడంతో ఆ ప్రాంతంలోని సైనికులు ఖంగుతిన్నారు. అంతలోనే తేరుకుని టిపూ మీద తుపాకి పేల్చాడు. టిపూ సుల్తాన్ గాయపడి కూడా విక్రమించటం చూసిన మిగతా సైనికులు ఆయన మీద విచక్షణా రహితంగా తుపాకి గుండ్ల వర్షం కురిపించారు. ఆ గుండ్ల వర్షంలో పోరాట యోధుడు టిపూ సుల్తాన్, 1799 మే మాసం 4వ తేదీ సాయంసమయాన కన్నుమూసారు.




**టిపూ సుల్తాన్ మృతిచెందిన స్థలంలో నిర్మించిన స్మారక స్థూపం**

## యుద్ధభూమిలో అమరుడైన ప్రప్రథమ స్వదేశీ పాలకుడు

ఈ విధంగా బ్రిటీషర్లతో కదన రంగాన ధైర్యసాహసాలతో పోరాడుతూ చివరి శ్వాస వదలిన స్వదేశీ పాలకులలో టిపూ ప్రథముడని చరిత్ర ఆయనను కీర్తిచింది. (..."Tipu Sultan was the single brave hero of Indian Histroy who fighting the Britishers met his martydom in the battle field.." - Prof.Jaya Prakash) ఈ విషయాన్ని The Sword of Tipu రచయిత Bhagavan S. Gidwani వ్యక్తం చేస్తూ, ఈ విషయాన్ని ఓ విదేశీ చరిత్ర పరిశోధక విద్యార్థి ద్వారా తెలుకుని తాను ఆశ్చర్యపోయానని, ఈ విషయం విన్న తరువాత టిపూ మీద తనకు ప్రత్యేక శ్రద్ధ ఏర్పడిందని, దాని ప్రతిఫలమే ప్రఖ్యాత చారిత్రక నవల The Sword of Tipu ఉనికిలోకి వచ్చిందని పేర్కొన్నారు.

టిపూ సుల్తాన్ ప్రాణాలు వదలిన ఆరు గంటల వరకు ఆయన మరణించిన వార్త ఎవ్వరికీ తెలియరాలేదు. యుద్ధ రంగంలో ఆయన కన్పించకుండా పోవటంతో పలు ఊహాగానాలు సాగాయి. ఆయన అమరుడైన విషయం స్వజనులకు కూడా తెలియదు. శతృవు చక్రబంధం నుండి సుల్తాన్ చాకచక్యంగా తప్పించుకున్నారని



శ్రీరంగపట్నంలోని టిపూ అంతఃపురం శిథిలాలు







శ్రీరంగ పట్నానికి సమీపాన గల హైదర్ అలీ, టిపూ సుల్తాన్ సమాధి

సన్నిహితులు భావించ సాగారు. ఈ మేరకు పలు ఊహాగానాలు సాయం సమయం వరకు షికార్లు చేశాయి.

చివరకు చీకట్లు కమ్ముకుంటున్న వేళ బ్రిటీష్ సైనిధికారి జనరల్ హరిస్, తన సాయుధ బలగాలను, టిపూ బంధువులు, సేవకులకు వెంటబెట్టుకొని మృత వీరుల గుట్టలలో టిపూ కోసం వెతుకులాట ప్రారంభించాడు. చివరకు విశ్వాసపాత్రులైన సైనికుల మృతదేహాల మధ్యన విగత జీవుడైన టిపూ కన్పించారు. అప్పటికీ ఇంకా అనుమానమే! టిపూ బ్రతికి ఉంటే, ఒక్కసారిగా లంఘిస్తే అమ్మో! అనుకుంటూ భయం భయంగా కంపెనీ బలగాలు ఆయన భౌతిక్కాయాన్ని సమీపించేందుకు సాహసించలేకపోయాయి. టిపూ భౌతిక కాయం చుట్టూ సాయుధులైన సైనికులను నిల్పోపెట్టి, ఏ క్షణాన్నైనా తుపాకులు గర్జించేందుకు వీలుగా టిపూకు గురిపెట్టించి ఆయన దేహాన్ని సమీపం నుండి పరిశీలించి,

## టిపూ కుమారులు



ఫతె హైదర్



అబ్దుల్ ఖాలిద్



మోయిజుద్దీన్



సుల్తాన్ మొహియుద్దీన్



యాసీన్ సాహెబ్



సుభాన్ సాహెబ్





అప్పుడు టిపూ మరణాన్ని జనరల్ హారిస్ ధృవపర్చుకున్నాడు. అప్పటికే టిపూ ధరించే ప్రత్యేక తలపాగా, బెల్టు, ఖడ్గం మాయమయ్యాయి.

టిపూ మృతదేహాన్ని స్వయంగా పరిశీలించి టిపూ మరణించారని నిర్ధారణ చేసుకున్నాక, ఆ సమయంలో కలిగిన ఆనందాన్ని పట్టలేక **ఈ నాటి నుండి ఇండియా మనది** ("..Now India is Ours.") అని ఆంగ్లేయ సైనికాధికారి జనరల్ హారిస్ ప్రకటించాడు. టిపూ సుల్తాన్ సజీవంగా ఉన్నంతవరకు భారతదేశాన్ని పూర్తిగా తమ గుప్పెట్లోకి తీసుకునేందుకు సాధ్యం కాదని, టిపూ ఉన్నంత వరకు తమ ఎత్తులు–కుయుక్తులు సాగవని గ్రహించిన బ్రిటీషర్లు, టిపూ కన్నుమూసాక సంతోషం పట్టలేక పోయారు.

ఈ విజయం తరువాత ఓ ఆంగ్లేయాధికారి మాట్లాడుతూ, Defeat of Srirangapatnam would lay the Eastern empire under our feet అని వ్యాఖానించాడని ప్రముఖ చరిత్రకారుడు జి.యస్ సర్దేశాయి తన History of Marathas లో ఉటంకించాడు. టిపూ మీద విజయం సాధించాక జరిగిన విందులో గవర్నర్ జనరల్ లార్డ్ వెల్లస్లీ మాట్లాడుతూ " Friends today I am taking this glass of wine on the corpse of India..." అన్నాడు. ఆంగ్లేయాధికారి Thomas Minro.. మాట్లాడుతూ " We can easily capture all of India but Tipu is the only hurdle.." అన్నాడంటే టిపూ బ్రిటీషర్ల దురాక్రమణను ఎంతగా ఎదుర్కొన్నాడో ఎంతగా అవరోధం అయ్యాడో, ఆంగ్లేయులను ముందుకు సాగన్వికుండా మరెంతగా నిలువరించాడో అవగతం అవుతుంది.

టిపూ ప్రజల మనస్సులలో ఎర్పరచుకున్న సుస్థిర స్థానాన్ని గమనించిన గవర్నర్ జనరల్ లార్డ్ వెల్లస్లీ బ్రిటీష్ సైన్యాధికారులకు ఇచ్చిన విందులో మాట్లాడుతూ, **మిత్రులారా మిమ్మల్ని నన్ను ఈ ప్రపంచం మర్చిపోవచ్చు. అయితే టిపూ స్మృతులు మాత్రం కలకాలం నిలచిపోగలవు.** (..."I fear my friends that Tipu's memor will live long after the world has ceased to remember you and me...") అని ఘనంగా నివాళులు అర్పించటం విశేషం.

టిపూ కన్నుమూసాడని నిర్ధారించుకున్నాక బ్రిటీష్ సైనిక కూటమికి పట్టపగ్గాలు లేకుండా పోయాయి. మైసూరు రాజ్య రాజధాని శ్రీరంగపట్నం మీద ఆంగ్లేయ కూటమికి చెందిన సైనిక బలగాలు విజృంభించాయి. ఈ విజృంభణ మూడు రోజుల పాటు

సాగింది. శ్రీరంగపట్నం ప్రజలను యధేచ్ఛగా దోచుకున్నాయి. టిపూ కుటుంబీకులతో సహా, సామాన్య ప్రజలను శారీరంగా, మానసికంగా హింసల పాల్జేసాయి. స్త్రీలు, వృద్ధులు, పిల్లలను బేధం లేకుండా బ్రిటీషర్లు శ్రీరంగపట్నవాసుల మీద అత్యాచారాలకు, అంతులేని దోపిడికి పాల్పడి, విలువైనది ప్రతీది దోచుకుని, తమను ముప్పు తిప్పలు పెట్టి, మట్టి కరిపించిన టిపూ సుల్తాన్ మీద భయంకరంగా కసి తీర్చుకున్నాయి. టిపూ సుల్తాన్ ప్రాసాదాన్ని పూర్తిగా దోచుకుని విధ్వంసం సాగించాయి. టిపూకు ప్రియమైన గ్రంథాలయాన్ని, ప్రభుత్వం రికార్డులను, టిపూ సుల్తాన్ శ్రీరంగపట్నాన్ని శ్మశానవాటికను చేసిగాని శత్రు సైనికులు అక్కడ నుండి నిష్క్రమించలేదు. ఈ దోపిడిలో లభించిన అతి విలువైన వస్తువులు, బంగారు ఆభరణాలు, వజ్ర వైఢూర్యాలతో పాటుగా గ్రంథాలు, ప్రభుత్వం రికార్డులు, సనద్‌లు, టిపూ సుల్తాన్ కుటుంబానికి సంబంధించిన ప్రత్యేక వస్తువులు అన్నీ కూడా శ్రీరంగపట్నం నుండి కలకత్తా చేరి అటు నుండి ఇంగ్లాండుకు తరలి వెళ్ళాయి. ఈ అకృత్యాలను, కర్ణాటక ప్రభుత్వం మాజీ మంత్రి, చరిత్రకారుడు జనాబ్ మహమ్మద్ మొయినుద్దీన్ రాసిన **శ్రీరంగపట్నం అఫ్టర్ డాన్** అను ఆంగ్ల గ్రంథంలో సవివరంగా పేర్కొన్నారు.

శత్రువు చేత కూడా ఘనమైన నివాళులు, ప్రశంసలు అందుకున్న టిపూ సుల్తాన్ లాంటి స్వదేశీ పాలకులు భారతదేశ చరిత్రలో అరుదు. ఆ కారణంగా చివరి నెత్తురు బొట్టు నేలరాలే వరకు బ్రిటీషర్లతో పోరాడి, చివరకు రణరంగంలో కన్నుమూసిన, భారతదేశం గర్వించదగిన ముద్దుబిడ్డడు టిపూ సుల్తాన్ చరిత్రపుటలలో అరుదైన శాశ్వత స్థానం పొందారు.





# ఆధార గ్రంథాలు - పత్రికలు




01. Who is Who Indian Martyrs ( 3 Vols.) - Dr. PN. Chopra
02. History of Freedom Movement in India (4 Vols.), Dr. TaraChand, Govt of India, New Delhi, 1992
03. Freedom Movement and Indian Muslims - Santimoy Ray
04. Mopilla Muslims and Kerala - Ronald E. Miller, 1976
05. Encyclopedia of Muslim Biography , 5 Vols., Ed. by N. Kr. Singh, APHPC, New Delhi, 2001
06. Muslims India, 3 Vols. Ed. by Naresh Kumar Jain, Manohar, 1979
07. The Role of Minorities in Freedom Struggle Ed. by Dr.A.A Engineer
08. The Muslims in British India - P. Hardy, 1972
09. Kerala Muslims - Ed. by Dr. Asghar Ali Engineer
10. India's Struggle for Independence - Dr.Bibin Chandra
11. An Advanced History of India - RC Majumdar
12. History of India - E.Marsden
13. Tipu Sultan - Prof. B.Sahaik Ali
14. Arungzeb and Tipu Sultan - Dr. BN Pande
15. History of India - James Mill
16. Sword of Tipu - Gidwani
17. The Discovery of India - Jawaharlal Nehru
18. India's Struggle for Freedom - An Album
19. Strom over Srirangapatnam - P.Fernandaz
20. Bondage and Freedom - Dr Visweswaraiah
21. Muslims in India - S.Abul Hasan Ali Nadwai
22. Eminent Muslims Freedom Fighters - G. Allama
23. The Milli Gazette, English Fortnightly Issues, New Delhi

24. Geeturai, Telugu Weekly Issues, Hyderabad
25. Souvenir, IOS, New Delhi, 1998
26. Radiance, Views Weekly Issue on Tipu Sultan, Aug. 1999
27. Hindustani Musalmano ka Jang-e-Azadi Mei Hissa (Hindi) - Syed Ibrahim Fikri, New Delhi
28. Bharatha Swathanryadalli Muslimara patra ( Kannada), Khuddim Pub lications, Karnataka, 1999.
29. Tipu ki Jeevan (Hindi) - D.L.Nigam
30. Bharatha Swathntrodyamam : Muslimlu, (Telugu) Syed Naseer Ahamed
31. Swathamtra Samgarma Charitra ( Telugu), M.Nagabhushanam
32. Bharatha Swathantrya Sayudha Samara Charitra ( Telugu), Padala Rama Rao.
33. Brief History of Andhra Pradesh, Ed. by Mohd. Abdul Waheed Khan, Govt.of AP, Hyderabad, 1972.
34. Encyclopedia of Women Biography, 3 Vols. Ed. by Nagendra K. Sing, AHPPC, New Delhi, 2001.
35. WWW. Tipusultan. Org
36. WWW. Mysore Samacharam .Com

## రచయిత ఇతర రచనలు

**01. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు**

**02. భారత స్వాతంత్ర్యోద్యమం : ఆంధ్రప్రదేశ్ ముస్లింలు**

**03. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం ప్రజాపోరాటాలు**

**04. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లింలు**

**05. షహీద్ -యే- ఆజం అష్ఫాఖుల్లా ఖాన్**

**06. భారత స్వాతంత్ర్యసంగ్రామం : ముస్లిం యోధులు-1**